

PIRANHA



ACTIVE



CADET HX



YANKEE



ROBO COP

Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.

Because it's never too early to be a hero.



# గోల్కొండ కోట

## హైదరాబాద్



గోల్కొండలో అమితాబ్ బచ్చన్!
అలనాటి గోల్కొండ రాజ్య వైభవం గురించి, కుతుబ్ షాహీ పాలకుల గురించి
ప్రతిరోజూ ఆయన తన కంచుకంఠంతో వివరిస్తారు!

దేవగిరిని పాలించిన యాదవరాజులు క్రీ.శ. 1163 లో గోల్కొండ కోటను నిర్మించారు. బహుశా 'గొల్లకొండ' అనే మాట గోల్కొండగా మారి ఉంటుందని చెబుతారు. యాదవుల నుంచి ఈ కోట కాకతీయరాజుల వశమయింది. ఆ తరవాత – తొలుత తెలంగాణాలో బహ్మనీ సుల్తానుల సామంతుగా ఉండి 1518లో స్వతంత్రం ప్రకటించుకున్న సుల్తాన్ కులీ వశమయింది!

కుతుబ్‌షాహీ వంశస్థాపకుడైన సుల్తాన్ కులీ దాదాపు నాలుగు దశాబ్దాలపాటు గొప్పగా పాలించాడు. ఆఖరికి తన సొంత కొడుకు జమ్షీద్ చేసిన కుట్ర ఫలితంగా తన 99వ యేట దారుణంగా హత్యచేయబడ్డాడు!

జమ్షీద్ రాజ్యాధికారాన్ని చేపట్టగానే, అతని సోదరుడు ఇబ్రహీం పొరుగు రాజ్యమైన విజయనగరానికి పారిపోయి, అక్కడ తలదాచుకున్నాడు. ఏడేళ్ళ తరవాత జమ్షీద్ మరణానంతరం, ఆయన గోల్కొండ రాజ్యాధికారపగ్గాలు చేజిక్కించుకోవడానికి తిరిగి వచ్చాడు. ఆయన విజయనగర రాజ్యంలో ఉన్నప్పుడు భాగీరథి అనే హైందవ రాకుమారిని వివాహమాడాడు. కళల పట్ల, సంగీత నృత్యాల పట్ల ఆసక్తిని పెంచుకున్నాడు. 1580వ సం.లో ఆయన మరణించేంత వరకు ముప్పై ఏళ్ళ పాటు గోల్కొండను వైభవోపేతంగా పరిపాలించాడు. ఆయన కుమారుడు మహమ్మద్ కులీ, 15వ యేట సింహాసనాన్ని అధిష్ఠించి ముప్పై మూడేళ్ళు అవిచ్ఛిన్నంగా పరిపాలించాడు. ఆయనపరిపాలనా కాలంలోనే, చుట్టూ తటాకాలతో, ఉద్యానవనాలతో హైదరాబాద్‌నగరం నిర్మించబడింది.



భక్తరామదాసుగా ప్రసిద్ధిగాంచిన భక్తకవి కంచర్ల గోపన్న గోల్కొండ కోట బందిఖానాలోనే శిక్షను అనుభవించాడు. ఆయన గోల్కొండలో పన్నులు వసూలుచేసే అధికారిగా ఉంటూ వసూలు చేసిన ధనాన్ని భద్రాచలంలో రామాల యాన్ని పెద్దదిగా పునరుద్ధరించడానికి వినియోగించాడు. ఆ చర్యకు ఆగ్రహం చెందిన గోల్కొండ తానీషా ప్రభువు, గోపన్నను గోల్కొండ బందిఖానాలో బంధించాడు. ఆయన నిరంతర రామధ్యానంతో, భక్తి కీర్తనలు రచిస్తూ గడిపాడు. ఆ సమయంలో రామలక్ష్మణులు, తానీషాకు కలలో కని పించి, గోపన్న చెల్లించవలసిన బాకీ మొత్తాన్ని చెల్లించినట్టు చెబుతారు. దాంతో సంభ్రమాశ్చర్యాలకు లోనైన తానీషా గోపన్నను బందిఖానా నుంచి విడుదల చేయడంతో పాటు, భద్రాచల కోదండరామాలయ నిర్మాణానికి ధనాన్నీ, ఆభరణా లనూ మంజూరు చేశాడు.

కుతుబ్‌షాహీలు గొప్పకళాపోషకులు. ముఖ్యంగా సంగీత నాట్యకళలను పోషించి ప్రోత్సహించారు. ఉర్దూ, పర్షియన్ భాషలతో పాటు స్థానికమైన తెలుగు భాషకు కూడా ప్రాము ఖ్యతనిచ్చారు. 1687 వరకు కుతుబ్ షాహీల పాలన కొన సాగింది. అయితే, షాహీవంశస్థాపకుడి జీవితం అంతమయి నట్టే, చిట్టచివరి పాలకుడైన అబుల్ హాసన్ అంటే తానీషా జీవితం కూడా ఆంతరంగికుల ద్రోహానికీ, కుట్రకూ బలయి పోయింది.

గోల్కొండ కోట అభేద్యమైనది. మొగల్ చక్రవర్తి ఔరంగ జేబు దీనిని ముట్టడించి పట్టుకోవడానికి ఎనిమిది నెలలు విఫలయత్నం చేశాడు. ఆఖరికి కోట లోపలి సైన్యంలోని కొందరు ద్రోహులు, స్వార్థంతో లంచానికి లోబడి కోట రహస్య ద్వారాలు తెరిచి దురాక్రమణదారులను లోపలికి రానిచ్చారు!

తానీషా పట్టుబడి, చెరసాలపాలై అక్కడే మరణించాడు. ఆవిధంగా ఉజ్వలంగా వెలుగొందిన కుతుబ్‌షాహీల శకం అంతమయింది.

ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధిసంస్థ గోల్కొండ కోట ప్రాంగణంలో విలక్షణమైన రూపవాణి కార్యక్రమం ద్వారా గోల్కొండ ఉజ్వల చరిత్రను మన కళ్ళముందుకు తెస్తు న్నది. మనదేశంలో జరిగే ఉత్తమమైన రూపవాణి కార్య క్రమంగా ఇది ప్రశంసలనందుకున్నది. గంభీరమైన కంఠ స్వరంతో అమితాబ్ బచ్చన్ వ్యాఖ్యానం దీనికి అదనపు ఆకర్షణను కలిగిస్తూ – గోల్కొండ వైభవాన్నీ, విషాద ఉదం తాలనూ మన కళ్ళముందు కదలాడేలా చేస్తున్నది.

















## ఈ సంచికలో ...





**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
*Subscription Division*
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

బాదం - చందనం ...

# ఛాంపియన్ చిట్టి ఎంపిక









మైసూర్ శాండల్
సంస్థ గత 80 సంవత్సరాలకు
పైగా చందనం శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి
తీసుకువస్తోంది.






Almond oil moisturiser and antiseptic soap.



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# పండుగరోజులు

మళ్ళీ పండుగరోజులు ప్రారంభమయ్యాయి. పండుగలు అనగానే పిల్లలలో ఆనందోత్సాహాలు పెల్లుబుకుతాయి. పెద్దలు బంధుమిత్రులను కలుసుకోవడం; విందులు వినోదాలతో బాధలనూ, విభేదాలనూ మరిచిపోయి పండుగపూట సంతోషంగా గడపడం మన సంప్రదాయం.

పండుగల సందర్భంగా పూజలు, ప్రార్థనలు, ఉత్సవాలు, ఊరేగింపులు జరపడం సరే: వీటితోపాటు మనకింత తిండీ, బట్టా, నీడా కల్పిస్తున్న కష్టజీవులనూ; రేయింబవళ్ళు దేశ సరిహద్దులను కాపాడుతూన్న సైనిక సోదరులనూ; మానవతా విలువలను మంటకలిపి, స్వార్థ ప్రయోజనాలకోసం హింసాత్మకచర్యలకు పూనుకున్నవారి దురాగతాలకు ప్రాణాలర్పిస్తూన్న వీరులనూ, త్యాగధనులనూ; హింసలకు బలవుతూన్న అమాయక జీవులనూ ఒకసారి స్మరించుకోవడం అవసరం!

సాటి మనుషులమీదే కాదు; ప్రకృతిమీద, మూగప్రాణులమీద కూడా హింసాత్మక కృత్యాలు కొనసాగుతున్నాయి. స్వార్థం పెచ్చుపెరిగి, సామరస్యం కొరవడడమే వీటికంతా మూలకారణం. ఒకానొకప్పుడు మనుషులు - జంతువులు, పక్షులతోపాటు శాంతియుత సహజీవనం సాగించారన్న సత్యం మరిచిపోకూడదు!

మన జాతిపిత గాంధీజీ జన్మదినం అక్టోబర్‌లో జరుపుకుంటున్నాం. దేశప్రజలలో సమరస భావం పెంపొందాలని గాంధీజీ ఆశించి, ''నిరుపేదల హృదయాలలో సైతం ఇది మనదేశం అనే భావం వేళ్ళూనాలి. దేశాభివృద్ధి కార్యక్రమాలలో వారి అభిప్రాయాలకూ సముచిత స్థానం కల్పించాలి. ప్రజల మధ్య హెచ్చుతగ్గులు తగ్గి, తరతమ భేదాలు తొలగిపోయి, సకలజనులూ పరిపూర్ణ సామరస్యంతో జీవించే భారత దేశాన్ని నిర్మించుకోవాలి!'' అని కలలు కన్నాడు.

ప్రజలమధ్య అలాంటి సామరస్యాన్ని పెంపొందించడానికే పండుగలు ఏర్పడ్డాయి. ఆ ఉత్సవ స్ఫూర్తినీ, పండుగల ఉత్సాహాన్నీ మనలో నింపుకుని, సామరస్యాన్ని పెంపొందించుకున్నప్పుడే వీటికి సార్థకత లభిస్తుంది!

---

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org



## సుప్రసిద్ధంకాని సుందర ప్రదేశాలు:



# అరకులోయ

మీరు మునుముందు ఏదైనా పర్వతప్రదేశాలకు వెళ్ళాలనుకుంటే ఆంధ్రరాష్ట్రంలోని అరకులోయకు వెళ్ళి కొన్నిరోజులు ప్రశాంతంగా గడిపి రావచ్చు. చాలా ప్రశాంతమైన సుందరప్రదేశం అరకులోయ. విశాఖపట్నానికి 112కి. మీ. దూరంలో తూర్పు కనుమలలోని అనంతగిరి కొండలలో అరకులోయ ఉంది.



సముద్రమట్టానికి 975 మీటర్ల ఎత్తులో ఉన్న ఈ ప్రాంతానికి జల్దా జలపాతం నుంచి నీటి సరఫరా నిరంతరాయంగా జరుగుతోంది.

చల్లని ప్రశాంత వాతావరణం, ఎటుచూసినా కన్నులపండుగ చేసే ప్రకృతిదృశ్యాలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి.

ఇక్కడ కొన్నితెగల గిరిజనులు నివసిస్తున్నారు. అప్పుడప్పుడూ జరిగే సంతలలో చీపురుకట్టలు, చింతపండు, తేనె అమ్ముతూ కనిపిస్తారు.

అరకులోయ సమీపంలో ఉన్న లక్షలాది సంవత్సరాలకు పూర్వం ఏర్పడిన బొర్రా గుహలు కూడా పర్యాటకులను అమితంగా ఆకర్షిస్తున్నాయి. టైడా 'జంగిల్ బెల్స్' ప్రకృతి శిబిరం కూడా ఇక్కడికి సమీపంలోనే ఉంది.

ఈ ప్రాంతంలో నివసిస్తున్న గిరిజనుల జీవనవిధానం, కళలు, సంప్రదాయాలు, సంస్కృతి మొదలైన విషయాలను తెలియజేసే ప్రదర్శనశాల ఒకటి ఇక్కడ ఉంది.

పర్యాటకుల కోసం ఒక నమూనా గ్రామాన్ని కూడా ఇక్కడ ఏర్పరచి ఉన్నారు.

చుట్టూ ఏపుగా పెరిగిన పచ్చిక, పొదలు, గుబుర్లు, ఓషధీ మొక్కలు, అన్యప్రాంతాల ఫలవృక్షాలతోటలు నిండిన చెట్టుచేమల గుండా వాహ్యాళికివెళ్ళి రావడం ఎంతో హాయినీ, ఆనందానుభూతినీ కలిగిస్తుంది!

### ఇక్కడికి చేరుకోవడం ఎలా?

విశాఖపట్నానికి 112 కి.మీ. దూరంలో ఉన్న అరకులోయకు రైలు, రోడ్డు మార్గాలు రెండూ ఉన్నాయి. కొత్తవలస-కిరండూల్ రైలుమార్గంలో అరకులోయ ఉంది. విశాఖపట్నం నుంచి రైలు ప్రతిరోజూ ఉదయం బయలుదేరి వెళ్ళి, సాయంకాలం తిరిగివస్తుంది.



# మాయాసరోవరం

## 9

[జయశీలుడు వదిలిన బాణం నరవానరానికి తగలగానే, కృపాణజిత్తు కొండ దిగువకుచూసి, ఆ బాణం వదిలినవాడు తన శత్రువైన జయశీలుడని గుర్తించాడు. ఆ వెంటనే అతడు గడెకొండ అనుచరులతో కలిసి, వాళ్ళ గూడెంకేసి పారిపోయాడు. గడెకొండ అతణ్ణి హేళన చేయగా, కృపాణజిత్తు ఆగ్రహం చెంది తన నరవానరాన్ని అతడిపైకి ఉసిగొల్పాడు. తరవాత -]

కృపాణజిత్తు, నరవానరాన్ని తమ నాయకుడి పైకి ఉసిగొల్పడం చూస్తూనే, గడెకొండ అనుచరులు ఆయుధాలెత్తి పట్టుకుని కృపాణజిత్తుపైకి రాసాగారు. ఇది చూసి కృపాణజిత్తు భయకంపితుడయ్యాడు. వాళ్ళెంత మరుగుజ్జులైనా, తాను ఒంటరిగాడు!

కృపాణజిత్తు చప్పున ఒక నిశ్చయానికి వచ్చి, తనను చుట్టుముట్టుతున్న మరుగుజ్జులకేసి చిరునవ్వుతో చూసి, "తొందర పడకండి, నేను మీ మిత్రుణ్ణి. నరవానరాన్ని నేనెంత బాగా మచ్చికచేశానో, మీ నాయకుడికి చూపేందుకు, అతణ్ణి పట్టుకోమన్నాను," అంటూ వానరం చేతుల్లో వున్న గడెకొండను విడిపించాడు.

గడెకొండ ప్రాణభయంతో వణికిపోతూ, దూరంగా వున్న ఒక గుడిసె ముందుకు పోయి, అక్కడ ఒక ఎండుమోడు మీద కూర్చున్నాడు. అతడి అనుచరులు అతడి చుట్టూ చేరి, ఇప్పుడేం చేయమంటావని అడిగారు. ఎక్కడి నుంచో వచ్చిన, ఈ మహాకాయుడి సాయం కోరి, తను మొదటికే ముప్పు తెచ్చుకున్నానని, ఆసరికి గడెకొండ గ్రహించాడు.



అతడు చిన్న గొంతుతో, " ఒరే, నే చెప్పేది జాగ్రత్తగా వినండి! వాడు తన వానరం పక్కనే నిలబడి, మనం ఏమిచేయబోతున్నామా అని గుడ్లు మిటకరించి మరీ చూస్తున్నాడు. వాడితో ముఖాముఖి కలబడి మనం జయించలేం. వాడి నుంచి ఆ వానరాన్నీ, ఆ పొడవాటి కత్తినీ వేరుచేయాలి. అప్పుడు మనలో కొందరం చచ్చినా, వాణ్ణిచంపి పీడవిరగడచేసుకోవచ్చు," అన్నాడు.

"బాగానే వుంది. మరి అందుకు తగిన ఉపాయం ఏమిటి?"అని అడిగాడు ఒక ఘురుగుజ్జువాడు.

" ఈ మహాకాయుడు చచ్చింతర్వాత, గడెకారిరాణి మనందర్నీ తేలిగ్గా నాశనం చేయ గలుగుతుందే! ఇప్పుడా దుర్మార్గురాలికి, ఇద్దరు రాక్షసుల్లాంటివాళ్ళు సాయంకూడా వున్నారు," అన్నాడు మరొక మరుగుజ్జు.

గడెకొండ వాళ్ళిద్దరికేసీ కోపంగా చూస్తూ, " ఒకవేళ చావు తప్పకపోతే, మనజాతి వాళ్ళ చేతుల్లోనే చద్దాం. అంతేకాదు, మనమంతా రాణి దగ్గరకు పోయి, ఇక నుంచి విధేయు లుగా వుండి సేవచేస్తామంటే ఆమె క్షమించక పోదు," అన్నాడు.

దూరంగా వుండిఇదంతా చూస్తున్న కృపాణ జిత్తు, నరవానరాన్ని లాక్కుంటూ వాళ్ళదగ్గి రకు వచ్చి, " ఇప్పుడు మీరు చేస్తున్న కుట్ర ఏమిటి? హఠాత్తుగా వచ్చి మీదపడి చంపా లని చూస్తున్నారా? నిజం చెప్పండి!" అంటూ గద్దించి అడిగాడు.

గడెకొండ ఎండుమోడు మీది నుంచి లేచి నిలబడి, "అయ్యా, మహాకాయా! చేస్తున్న కుట్ర ఏమీలేదు. ఇక్కడమేం చాలా చిక్కుల్లో పడిపోయాం. ఇంకా ఇక్కడ ఉండడం క్షేమం కాదు. అందుకని, సూర్యాస్తమయం లోపలే అరణ్యంలో చాలా దూరంగా పారిపోవాలను కుంటున్నాం," అన్నాడు.

గడెకొండ ఇలా అనగానే కృపాణజిత్తు బెదిరిపోయాడు. లోగడ అరణ్యంలో తను ఒంటరిగా పడిన బాధలన్నీ అతడికి గుర్తుకు వచ్చినై. అతడు వెంటనే, గడెకొండతో ఎంతో మర్యాదగా, "గడెకొండా, నువ్వేం భయ పడకు. ఇవ్వాళ నడిరాత్రి వేళ, మీరు నాకు సాయంగా వస్తే, నీ నా శత్రువులందర్నీ, నిద్రలో వున్న వాళ్ళను నిద్రలో వుండగానే నేనూ, నా నరవానరం కాలరాచేస్తాం. తర్వాత నువ్వు, కంటికానేంత దూరంలో వున్న కొండలకూ, అరణ్యానికీ రాజువు, తెలిసిందా? జై, గడె కొండ మహారాజుకూ!" అని బిగ్గరగా కేక వేశాడు.

ఇందుకు గడెకొండ తృప్తిగా తలాడిం చాడు. కృపాణజిత్తు, నరవానరాన్ని గొలుసుతో ముందుకు లాగుతూ, "సరే, మా ఇద్దరి ఆహారం మాటేమిటి? నేను ఇప్పుడే, నా కుటీరానికి పోతున్నాను," అంటూ బయలు దేరాడు.

"అంతా అక్కడ సిద్ధంగా వున్నది," అన్నాడు గడెకొండ, తల పక్కకు తిప్పి చిన్నగా నవ్వుకుంటూ.

కృపాణజిత్తు గూడెంలోని తతిమ్మా గుడిశె లకు కాస్తదూరంగా వున్న తన నివాసాన్ని సమీపించి, వెనుదిరిగి పెద్దగొంతుతో, "నడి రాత్రివరకూ నాకెవ్వరూ నిద్రాభంగం కలిగించ కండి. ఆ తర్వాత క్షణాలలో సర్వ శత్రు సంహారం!" అన్నాడు.




గడెకొండ ఈసారి మరింత తృప్తిగా తలా డించి, తన అనుచరులలో నమ్మకస్థులూ, ధైర్యవంతులూ అయిన నలుగురిని, తన గుడిశెకు తీసుకుపోయాడు. ఆ తర్వాత, మూడు నాలుగు గంటల కాలం గడిచి పోయింది. బాగా తిని గుడిసెలో గుర్రుపెట్టి నిద్రపోతున్న కృపాణజిత్తు హఠాత్తుగా నిద్ర మేల్కొని, "ఏమిటబ్బా, ఈ నూనె వాసన!" అంటూ ఒకసారి చుట్టూ కలయచూసి, "ఎవర్రా, బయట? ఏదో కుళ్ళిన ఆముదం వాసన వస్తున్నదేమిటి?" అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే బయటినుంచి, "అయ్యా, అది ఆముదం వాసనకాదు, మేపచమురుతో, మేలిమి బంగారంలాంటి తెల్ల నువ్వులనూనె కలిసిన చమురువాసన. క్రిమికీటకాలూ, దోమలూ రాత్రివేళ తమకు నిద్రాభంగం కలి గించకుండా వుండేందుకు, మా నాయకుడు తమ కుటీరాన్ని కప్పిన మోదుగ ఆకుల్ని ఈ నూనెతో తడపమన్నాడు," అని ఒక గడెకొండ అనుచరుడు అతి వినయంగా జవాబిచ్చాడు.

"అలాగా! మంచిది, మంచిది," అంటూ కృపాణజిత్తు పెద్దగా ఆవులించి, తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

ఆ సమయంలో గడెకొండ కొందరు అనుచరులతో గుడిసె ముందుకు వచ్చాడు. అతడు సైగ చేయగానే, మరుగుజ్జు ఒకడు నిశ్శబ్దంగా గుడిసె ద్వారం సగం తెరిచి లోప లికి పోయి, కృపాణజిత్తు గోడకు ఆనించిన కత్తిని తీసుకుని బయటికి వచ్చి, గుడిసెకు అన్నివైపులా నిప్పు పెట్టాడు.

ఒకటి రెండు నిమిషాలు గడిచేలోపలే, నిద్రపోతున్న కృపాణజిత్తుకు శరీరమంతా



పడిపోయాడు. ఇనుప గొలుసు అతడి పట్టు నుంచి జారిపోయింది.

ఇది చూసిన గడెకొండ, తన అనుచరులను హెచ్చరిస్తూ, "ఒరే, నరవానరాన్ని దాని దారిన దాన్ని పోనివ్వండి. ఈ కృపాణజిత్తును మాత్రం వదిలిపెట్టకండి. బళ్ళాలతో పొడవండి!" అన్నాడు.

కృపాణజిత్తు చావు భయంతో వణికిపోతూనే లేచి నిలబడి, దాపులనున్న ఒక లావుపాటి ఎండుకొమ్మను తీసుకుని పెద్దగా అరుస్తూ, గడెకొండ అనుచరులను ఎడాపెడా కొట్టసాగాడు.

మరుగుజ్జువాళ్ళ గూడెంలో రేగుతున్న మంటలూ, అరుపులూ, కేకలూ దాపుల అరణ్యవృక్షాల కిందవున్న ఇద్దరు వింత మనుషులు విన్నారు. వాళ్ళు గుర్రాల రూపంలో వున్న రెండు అద్భుత జంతువులను ఎక్కివున్నారు. ఆ జంతువుల శరీరాలు చేప పొలుసులలాంటి పొలుసులతో కప్పబడివున్నవి. చూడగా, వాటి లక్షణాలు మకరకేతు వాహనమైన జలగ్రహాన్ని పోలి వున్నవి. రౌతులిద్దరూ సొరచేప చర్మంతో కుట్టిన దుస్తులు ధరించి వున్నారు. వాళ్ళ నడుముల నుంచి పొడవాటి కత్తులు వేళ్ళాడుతున్నవి.

వాళ్ళల్లో ఒకడు చప్పున ఒరనుంచి కత్తి దూసి, "అన్నా, సర్పనఖా! అక్కడ చూడు! ఆ కనబడే గూడేన్ని ఎవరో శత్రువులు ముట్టడించి నానా బీభత్సం సృష్టిస్తూ సర్వనాశనం చేస్తున్నట్టున్నది!" అన్నాడు.

దానికి సర్పనఖుడనేవాడు విసుగ్గా, "సర్వనాశనం చెయ్యనీ, సర్పస్వరా! మనం ఏ లోకం వాళ్ళం? ఇదేలోకం? ఎవరెట్లాపోతే మనకేం?

భగ్గుమన్నట్టయి మెలుకువ వచ్చింది. అతడు ఒక చావుకేక పెట్టి, "మోసం!మోసం! ఎంతటి దారుణమైన నమ్మకద్రోహానికి పాల్పడ్డారీ మరుగుజ్జు వెధవలు! ఇందుకు ప్రతీకారం చేస్తాను, వీళ్ళ అంతు చూస్తాను" అని గంతులు వేస్తూ, తన కత్తికోసం గోడకేసి చూశాడు. కత్తి ఉండ వలసినచోట లేదు.

ఇంతలో నరవానరం భీకరంగా ఒక్క అరుపు అరిచి బలంగా గుంజేసరికి, దాని నడుముకు కట్టివున్న ఇనుపగొలుసు సగానికి తెగిపోయింది. అది చుట్టూ కమ్ముకు వస్తున్న మంటలకు బెదిరి గుడిసె ద్వారంకేసి పరిగెత్తింది. ఆ సమయంలో కృపాణజిత్తు వానరం నడుమునుంచి వేళ్ళాడుతున్న గొలుసును గట్టిగా పట్టుకున్నాడు. వానరం ఒక్క ఊపున పోయి ద్వారబంధాలను విరగ్గొట్టి బయటికి దూకింది. దానితోపాటు కృపాణజిత్తుకూడా బయటికిపోయి, గుడిసెముందు బోర్లా

మనం వచ్చిన పనేమిటి? మన జలాశ్వాల జాలపాదాలు అరిగిపోయేలా, ఈ అరణ్యాలూ, కొండలూ పట్టుకుని ఎందుకు తిరుగుతున్నాం?'' అన్నాడు.

''అన్నా, అదంతా సరే!'' అంటూ సర్ప స్వరుడు, గుర్రం మీద నిలబడి గూడెంకేసి చూస్తూ ఆశ్చర్యంగా, ''ఇదేదో బహుచిత్రంగా వున్నది! భయంకరమైన నరవానరం ఒకటి గిరికీలు కొడుతూ, పారిపోయే ప్రయత్నంలో మరుగుజ్జువాళ్ళను అటూ ఇటూ విసిరి వేస్తున్నది. దానికి తోడుగా ఒక మామూలు మనిషి! మరుగుజ్జువాళ్ళను చిత్రవధ చేసేస్తున్నాడు. ఈ దారుణాలను చూస్తూ ఊరుకోవడం ఎలా?'' అన్నాడు.

''అలా చెప్పవేం మరి! మనం నరవానరాన్నీ, మనిషినీ ప్రాణాలతో పట్టుకోవడం అవసరం. ఆ మనిషిద్వారా, తప్పిపోయిన మనవాడి సమాచారం ఏమన్నా తెలుస్తుందేమో!'' అంటూ సర్పనఖుడు తన గుర్రాన్ని అదిలించి, జీను నుంచి చుట్టలా వేళ్ళాడుతున్న తామరకాడల మోకును చేతికి తీసుకున్నాడు.

ఇద్దరూ గుర్రాలమీద వేగంగా గడెకొండ గూడేన్ని చేరేసరికి, నరవానరం బలమైన తన చేతులతో పట్టి గుడిసెలను కూలదోస్తున్నది. కృపాణజిత్తు పిచ్చి ఎత్తినవాడిలా అరుస్తూ, తనపైకి వస్తున్న మరుగుజ్జులను ఎండిన చెట్టుకొమ్మతో కొడుతున్నాడు.

''అన్నా, నేనీ నరవానరం సంగతి చూస్తాను. నువ్వు ఎనుబోతులా వున్న ఆ మనిషిని పట్టి బంధించు,'' అంటూ సర్పస్వరుడు తన గుర్రాన్ని నరవానరంకేసి పరిగెత్తించాడు.

సర్పనఖుడు తామరకాడల మోకును పైకెత్తి, దాని ఉచ్చును కృపాణజిత్తు కంఠానికేసి విసురుతూ, ''మాయాసరోవరేశ్వరుడికీ, జై!'' అంటూ కేకపెట్టాడు.

సర్పనఖుడు విసిరిన తాడు, కృపాణజిత్తు కంఠానికి చుట్టుకున్నది. దాని ఉచ్చు కంఠాన్ని





బిగించి పట్టే లోపలే, కృపాణజిత్తు ఒక చావు కేకపెట్టి, ''అయ్యా, నన్ను చంపకు! నీలాంటి మనిషే... ఒక వింత ఏనుగునెక్కిన మహాబలుడికి, నేను లోగడ చాలా సహాయం చేసి వున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు సర్పనఖుడు ఆశ్చర్యపోతూ, ''అయితే, ఆ మకరకేతు, నీకు తెలుసునన్నమాట! అంత గొప్పయోధుడు నీ నుంచి సహాయం కోరాడంటే, అతడు నిజంగానే చాలా పెద్ద ఇక్కట్లలో చిక్కి వుండాలి. ఆ మకరకేతు ఇప్పుడెక్కడ వున్నాడు?'' అని ప్రశ్నించాడు.

. కృపాణజిత్తు చేతులు రెండూ ముందుకు చాచి, ''ప్రశస్తమైన తమ తామరకాడల తాటి ఉచ్చు; నా గొంతును బాగా బిగించి పట్టి వున్నది. మాట్లాడడం కష్టసాధ్యమవుతున్నది. కొంచెంగా వదులు చేసేందుకు అనుమతిస్తారా?'' అని అడిగాడు.

''అలాగే అనుమతించాను. కానీ, పారిపోయేందుకు ప్రయత్నించావో, ఆ తాడు నీ పాలిటి యమపాశమవుతుంది, జాగ్రత్త!'' అన్నాడు సర్పనఖుడు కోపంగా.

కృపాణజిత్తు ఉచ్చును కాస్త పక్కకు లాగి, ''అయ్యా, ఆ మకరకేతు ఇప్పుడెక్కడున్నాడో నాకు తెలియదు. ఇప్పటికి కొద్ది రోజుల క్రితం, అమరావతీనగరంవాడైన జయశీలుడనేవాడూ, వాడి మిత్రుడైన కాపాలికుడొకడూ, అరణ్యంలో మకరకేతును నానా హింసలపాలూ చేశారు. ఈ సంగతే నేను అరణ్యప్రాంతాల నివసించేవాళ్ళ ద్వారా. విన్నాను,'' అన్నాడు.

అంతలో, గడెకొండ, సర్పనఖుడి ముందుకు వచ్చి, అతడికివంగి నమస్కారం చేసి, ''అయ్యా, నీటిగుర్రంశూరుడా! మీరు ఈదుర్మార్గుడితో మాట్లాడుతూ, తమతోటివాడికేమైనదీ గమనించనే లేదు,'' అన్నాడు.

సర్పనఖుడు, ఇది వింటూనే, చుట్టూ ఓ మారు కలయచూసి, గడెకొండను, ''నా తమ్ముడికి ఏం జరిగింది? ఎటు వెళ్ళాడు?'' అని గద్దిస్తూ అడిగాడు.

గడెకొండ తలాడిస్తూ, ''నీటిగుర్రంశూరుడా! నీ తమ్ముడూ, నరవానరం కవ్వించుకుంటూ, ఆ కనబడే చెట్ల గుంపులోకివెళ్ళారు. నీటిగుర్రం మరొకవైపుకు పరిగెత్తింది. ఆ నరవానరం, నీ తమ్ముణ్ణి మెడపట్టుకుని ఎత్తి భుజాన వేసుకుని మరొకవైపుకు పరిగెత్తింది. ఆ నరవానరం, ఈ కృపాణజిత్తు పెంపుడు జంతువు. ఈ దుర్మార్గుడే ఆ నరవానరాన్ని అలా చేయమని సౌంజ్ఞలద్వారా ఆజ్ఞాపించి వుంటాడు!'' అన్నాడు.

‘‘ఒరే, చావుకబురెంత చల్లగా చెప్పావురా, మరుగుజ్జువెధవా!’’ అంటూ సర్పనఖుడు, కృపాణజిత్తు కంఠానికి వేసినతాడును, గడె కొండ చేతికి ఇచ్చి, ‘‘ఈ దుర్మార్గుడు పారిపో కుండా చూసే బాధ్యత నీది,’’ అని, గుర్రాన్ని గడెకొండ చెప్పిన చెట్ల గుంపుకేసి వేగంగా పరిగెత్తించాడు.

మరుగుజ్జుల గూడెంలో లేచిన పొగా, మంటలూ, కృపాణజిత్తూ, నరవానరాలతో గడెకొండ అనుచరులు తెగించి పోరాడుతున్న ప్పుడు రేగిన కల్లోలం, రాళ్ళగుట్ట అవతల ఉన్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ విన్నారు. దానికి కారణం ఏమిటో తెలుసుకురమ్మని వాళ్ళు, మరుగుజ్జుసేనానికి చెప్పారు.

సేనాని ఇద్దరు అనుచరులను వెంటబెట్టు కుని గుట్టమీదికి పోయి గడెకొండ గూడెం కేసి కొంతసేపు చూశాడు. అతనికి అక్కడ జరుగుతున్నదంతా చాలా సంతోషం కలిగిం చింది. ఈ శుభవార్త జయశీలుడికి చెప్పేం దుకు అతడు వెనుదిరగబోయేంతలో, హఠా త్తుగా జలాశ్వాలమీద వచ్చిన సర్పనఖుడూ, సర్పస్వరుడూ, అక్కడ పోట్లాడుతుంటూన్న వాళ్ళమీద పడ్డారు.

ఇంతవరకూ చూసిన మరుగుజ్జుసేనాని, జలాశ్వాలను చూసి వింతపడుతూ పరుగు పరుగున పోయి సంగతి జయశీలుడికీ, సిద్ధ సాధకుడికీ చెప్పాడు.

ఇది వింటూనే సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ‘‘జై, మహాకాళా!’’ అని, జయశీలు డితో, ‘‘జయా, ఇక మనం వచ్చిన పని నెర వేరి నట్టే! జలాశ్వాలమీద వచ్చినవాళ్ళిద్దరూ, జలగ్రహం ఏనుగుతో వచ్చిన మకరకేతు



గుంపులోవాళ్ళనేదాంట్లో సందేహం లేదు. ఆ ఇద్దర్నీ పట్టుకుని నయానో భయానో వాళ్ళ నుంచి, ఆ మాయాసరోవరేశ్వరుడుండే చోటు తెలుసుకోవచ్చు. ఆ తర్వాత, కనకాక్ష రాజుగారి పిల్లలు–కాంచనవర్మా, కాంచనమాలలను బంధవిముక్తుల్ని చేయడం క్షణాలమీద పని!’’ అన్నాడు.

దానికి జయశీలుడు చిన్నగా నవ్వి, ‘‘సాధకా! ఎవరో ఇద్దరు మనుషులు వింత గుర్రాల మీద వచ్చారని వింటూనే, కనకాక్ష రాజుగారి పిల్లలు మనకు దొరికినంత ఉత్సా హంగా మాట్లాడుతున్నావు. కాని, మనం ముందుగా ఆలోచించవలసినదేమంటే – వాళ్ళు జలాశ్వాలమీద ఈ ప్రాంతానికి ఎందు కొచ్చారన్నదొకటి; వాళ్ళను ప్రాణాలతో పట్టు కోవడం ఎలా అన్నది రెండవది,’’ అన్నాడు.

ఈ జవాబుకు సిద్ధసాధకుడు నిరుత్సాహ పడిపోయి, శూలాన్ని కిందపడవేసి, ‘‘జయా!

వాళ్ళను ప్రాణాలతో పట్టుకునే పథకం ఏదో నువ్వే ఆలోచించు,'' అన్నాడు.

జయశీలుడు సరేనన్నట్టు తలవూపి, ''అయితే, నువ్వు శూలాన్ని కిందపడవేశా వెందుకు? ఆయుధాలను ఉపయోగించ కుండా ఇకనుంచీ నీ మంత్రశక్తినే నమ్ముకో దలచావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సిద్ధసాధకుడు, ''జై, మహా కాళా!'' అంటూ చిన్నగా మూలిగి, చప్పున శూలాన్ని చేతిలోకి తీసుకుని, ''జయశీలా! నా మంత్రశక్తి ఇంకా పరిపక్వం కాలేదు. ఆనాడు శ్మశానంలో మహాకాళుడి బంటు కాలకాళుడే, నా ప్రాణాలు పుచ్చుకునేంత పనిచేశాడు గదా!'' అన్నాడు.

జయశీలుడు, ''అవునవును,'' అని, మరుగుజ్జుసేనానికేసి తల తిప్పి, ''సేనానీ, నువ్వు కొందరు భటులతో, మా వెంట రావలసి వుంటుంది,'' అన్నాడు.

''అయ్యా, అలాంటి ఆజ్ఞకోసమే నేను ఎదురుచూస్తున్నాను,'' అని, మరుగుజ్జు సేనాని దూరంగా నిలబడివున్న మరుగుజ్జు భటులకు సౌంజ్ఞ చేశాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ వాళ్ళను వెంటబెట్టుకుని కొంతదూరం నడిచేసరికి, వాళ్ళకు కుడివైపున గుంపుగావున్న చెట్లలోంచి నరవానరం భయంకరంగా అరవడం వినిపించింది. అందరూ అటుకేసి చూశారు. నరవానరం చెట్ల కిందుగా గెంతుతూ నడుస్తున్నది. దాని భుజాలమీద వింతదుస్తుల్లో వున్న మనిషి ఒకడు కదలా మెదలక పడి వున్నాడు.

''జయా! మనం ప్రాణాలతో పట్టుకుని, మాయాసరోవరం రహస్యాలు తెలుసుకోవాలనుకున్నవాళ్ళల్లో ఒకడు నరవానరం చేతుల్లో హతమైపోయినట్టున్నది. ఆ రెండోవాడిమాటేమిటి?'' అన్నాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడు మాట ముగించే లోపలే, జలాశ్వం మీద సర్పనఖుడు వేగంగా చెట్ల కిందికి వస్తూ, ''సర్పస్వరా ఎక్కడ? సర్పస్వరా!'' అంటూ పెద్దగా కేకపెట్టాడు.

జయశీలుడు చప్పున చేయెత్తి, ''అందరూ, ఈ జలాశ్వం ఎక్కినవాడి కంటబడకుండా చెట్ల చాటున దాక్కోండి. ఎలా అయినాసరే, మనం వీణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలి!'' అని హెచ్చరించాడు. -(ఇంకావుంది)







# సిద్ధేంద్రుడి హితవు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమకు, ఎలాంటి ప్రతిఫలం ఆశిస్తున్నావో నాకు తెలియదు. కాని, నువ్వేమైనా మంత్రసిద్ధులు సాధించ దలచితే మాత్రం తగు జాగ్రత్తలోవుండాలి. ఎందుకంటే, వాటిని ఆచరణలో పెట్టడం కత్తిమీద సాములాంటిది. సిద్ధేంద్రుడనే పండితుడు, అలాంటి విషయంలో స్వార్థం పనికిరాదని హెచ్చరించినా, ఆయన శిష్యుల్లో విజయసింహుడనే



వాడు, కేవలం స్వార్థం కోసం ఆ సిద్ధులను ఉపయోగించుకున్నాడు. ఐనా, మరొక పండితుడు, అది ఏమాత్రం స్వార్థంకానీ, అధర్మం కానీ కాదని తోసిపుచ్చాడు. ఇందుకు ఉదాహరణగా, రవివర్మ, విజయసింహుడు అనే వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొక అరణ్యప్రాంతంలో, సిద్ధేంద్రుడనే మహాపండితుడు గురుకులం నడుపుతూండేవాడు. ఒకసారి ఆయన గురుకులంలో విద్య పూర్తిచేసిన కొందరు విద్యార్థులకు వీడ్కోలు చెబుతూ, ''నాకు తెలిసిన అన్ని శాస్త్రవిద్యలూ మీకు బోధించడం జరిగింది. మీరు అతిముఖ్యమైన ఒక ధర్మసూత్రాన్ని అన్నివేళలా గుర్తుంచుకోవాలి. మనిషి ఏది సాధించదలచినా, అది అతడి కృషి, పట్టుదల, మానసిక-శారీరక క్రమశిక్షణలవలననే సాధ్యం. కాని, మనిషి ఒక్కొక్కసారి ఎంత కృషి చేసినా ఫలితం కలగకపోవడమో, లేదా తగినంత ఫలితం లభించకపోవడమో జరుగుతూంటుంది. అటువంటి సందర్భాలలో మాత్రమే, మీరు నేర్చిన మంత్రశక్తిని ఉపయోగించుకోండి. అంతేకాని, మీ కృషినీ, పట్టుదలనూ పక్కనవుంచి, మంత్రశక్తితో సునాయాసంగా కార్యం సాధించే పరాన్నభుక్కులు కాకండి!'' అని హితబోధ చేశాడు.

గురువు సిద్ధేంద్రుడి ఈ హితవాక్కులు, గౌతమీపురవాసులైన రవివర్మ, విజయసింహులకు చాలా తృప్తి కలిగించాయి. వాళ్ళిద్దరూ చాలా సన్నిహితులైన మిత్రులు. వాళ్ళు పది సంవత్సరాల క్రితం గురుకులంలో చేరి, సిద్ధేంద్రుడి ఆదరాభిమానాలకు పాత్రులై విద్యాభ్యాసం ముగించారు.

వాళ్ళు తమ ఊరుకు ప్రయాణమవుతూ, గురువుకు సాష్టాంగ నమస్కారం చేశారు. ఆయన వాళ్ళను ఆశీర్వదించి మందహాసం చేశాడు. ఆ మందహాసంలో వాళ్ళకు, నా హితబోధ మరవకండి, అన్న హెచ్చరిక కనిపించింది.

తిరుగుప్రయాణంలో వాళ్ళిద్దరూ, గోకవరం అనే గ్రామం చేరుకున్నారు. అక్కడ గ్రామ మధ్యంలో వున్న సత్రంలో విడిది చేసి, భోజనానంతరం సత్రం అరుగుమీద కూర్చున్నారు. ఆ సమయంలో గ్రామప్రజల మాటల ద్వారా, ఆ సాయంత్రం అక్కడ మల్లయుద్ధపు పోటీలు జరుగనున్నట్టు తెలిసింది. ఆ చుట్టుపక్కల గొప్ప భీమబలుడుగా పేరుబడి విర్రవీగుతున్న ముక్కంటి అనేవాణ్ణి ఓడించిన వాడికి, గ్రామ పెద్దనుంచి వెయ్యి వరహాలు బహుమతిగా లభిస్తుంది.

రవివర్మ విజయసింహుడితో, ''విజయా! కేవలం డబ్బుకోసం కాకపోయినా, మనం గురుకులంలో నేర్చిన మల్లవిద్యాపాటవం ఏపాటిదో తెలుసుకునేందుకు, ఈ పోటీలో పాల్గొందాం. నేను గురువుగారు నిర్వహించిన పోటీలలో అందరినీ ఓడించినవాణ్ణి గదా! ముక్కంటి మీద నేను పోటీకి దిగుతాను,'' అన్నాడు.

దానికి విజయసింహుడు అభ్యంతరం చెబుతూ, ''మిత్రమా! ఈ అవకాశం నాకివ్వు, నువ్వేమో బాగా కలిగినవాడివి. నేనా, అంత కలిగినవాణ్ణికాను. ఆ వెయ్యి వరహాలూ సంపాయించుకునే అవకాశం, నాకివ్వు,'' అన్నాడు.

ఇందుకు రవివర్మ సంతోషంగా అంగీకరించాడు. ఇద్దరూ సాయంకాలం మల్లయుద్ధపు పోటీలు జరిగే ప్రదేశానికి వెళ్ళారు.

అక్కడ జనం గుంపులు గుంపులుగా చేరారు. గ్రామాధికారీ, ఇతర పెద్దలూ ఒక వేదికమీద ఆసీనులై వున్నారు. ముక్కంటి మీసం మెలివేసి, తనతో పోటీకి వచ్చినవాళ్ళను క్షణాల మీద మట్టి కరిపించాడు.

చివరకు విజయసింహుడి వంతువచ్చింది. విజయసింహుడి ధాటికి ముక్కంటి విలవిలలాడిపోయాడు. నాలుగైదు నిమిషాలు గడిచే లోపల విజయసింహుడు, ముక్కంటిని వెల్లకిలా పడగొట్టి, రెండుకాళ్ళూ వడిసి పట్టుకుని నేలమీద గిరగిరా తిప్పాడు.

జనం హర్షధ్వానాలు చేశారు. గ్రామాధికారి విజయసింహుడికి వెయ్యి వరహాలు బహూకరించి అభినందించాడు. మిత్రులిద్దరూ ఆ రాత్రి సత్రంలో గడిపి, తెల్లవారగానే తమ ఊరుకు బయల్దేరి, చీకటిపడే వేళకు





ఒక అరణ్యమార్గాన్ని చేరారు. ఆ చీకట్లో ముందుకు పోవడం ప్రమాదకరమని భావించి, దాపుల కనిపించిన ఒక పెద్దచెట్టు కింద పడుకుని, త్వరలోనే నిద్రలోకి జారుకున్నారు.

అర్ధరాత్రివేళ ఎవరో వాళ్ళను తట్టడంతో కళ్లు తెరిచి చూశారు. ఎదురుగా అతి బలిష్ఠులైన ముగ్గురు దొంగలు, పొడవాటి కత్తులతో కనిపించారు. విజయసింహుడు ఏమాత్రం జంకక, కఠినమైన స్వరంతో, "ఎవరు మీరు?" అంటూ గద్దించి ప్రశ్నించాడు.

దానికి దొంగల్లో ఒకడు పెద్దగా నవ్వి, "తెలియడం లేదా?" అంటూ కత్తి ఝుళిపించి, "గ్రామాధికారి ఇచ్చిన వెయ్యి వరహాలతోపాటు, మరేదైనా చిల్లరా మల్లరా వుంటే వేగిరం ఇచ్చేయండి, లేదా!" అంటూ కత్తిని విజయసింహుడి కంఠానికి గురిచేశాడు.

వాడు, మాట ముగించేలోపలే విజయసింహుడు గట్టిగా చిటికెవేసి తన కత్తి పిడిమీద చేయి పెట్టేంతలో, దొంగ భళుక్కుమంటూ నెత్తురు కక్కి బోర్లా పడిపోయాడు. ఇది చూసిన మిగతా ఇద్దరు దొంగలూ, "మాంత్రికులు! మాంత్రికులు!" అంటూ అరిచి, వెనుదిరిగి పారిపోయారు.

ఈ జరిగినదానికి రవివర్మ ఆశ్చర్యపోతూ, "నిజం చెప్పు, విజయా! ఈ దొంగమీద నువ్వు మంత్రం ప్రయోగించావు గదా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే విజయసింహుడు వెలవెలపోతూ, "క్షమించు, రవీ! ఇదేకాదు, ముక్కంటి మీద కూడా మంత్రం ప్రయోగించే సునాయాసంగా విజయం సాధించాను," అన్నాడు.

"అంటే, నువ్వు స్వార్థంకొద్దీ, మన గురువుగారుచేసిన హితబోధ మరిచావన్నమాట!" అన్నాడు రవివర్మ కోపంగా.

అందుకు, విజయసింహుడు శాంతంగా, "మిత్రమా! ఏది స్వార్థం, ఎలాంటి పరిస్థితుల్లో మంత్రశక్తుల్ని ఉపయోగించాలి, అన్నవిషయంలో మనిద్దరిమధ్యా అభిప్రాయ భేదం వున్నట్టు కనబడుతున్నది. మనం ఊరు చేరాక, మన చిన్ననాటి గురువులు విశ్వనాధాచార్యుల వారికి సంగతి చెప్పి, వారి అభిప్రాయం అడుగుదాం. ఇందుకు నీ అభ్యంతరం ఉండదనుకుంటాను," అన్నాడు.

దీనికి రవివర్మ జవాబు చెప్పకుండా మౌనంగా వూరుకున్నాడు. మర్నాడు సూర్యోదయం అయిన కొద్దిసేపటికి, ఇద్దరూ తమ ఊరు పక్కన ప్రవహిస్తున్న నదీతీరంలో గల విశ్వనాధాచార్యుడి ఆశ్రమం చేరారు. ఆ సమయంలో ఆయన ఆశ్రమం ముందున్న

చెట్టుకింద కూర్చుని ఏవో తాళపత్రాలు చూస్తున్నాడు.

రవివర్మా, విజయసింహుడూ ఆయనను సమీపించి పాదాభివందనం చేశారు. ఆచార్యుడు వాళ్ళను దీవించి, ''మీరు సిద్ధేంద్రుల వారి గురుకులంలో విద్యాభ్యాసం ముగించి త్వరలో రాబోతున్నట్టు, మీ పెద్దలద్వారా విన్నాను. సిద్ధేంద్రులవారు కుశలమేగదా?'' అని అడిగాడు.

ఇద్దరూ, ఆయనకు తమ గురువు క్షేమ సమాచారం గురించి చెప్పి, ఆయన తమ వీడ్కోలు సమయంలో చెప్పినహితవచనాలు, విశ్వనాధాచార్యుడికి తెలియజేశారు.

విశ్వనాధాచార్యుడు సంతోషంగా, ''సిద్ధేంద్రులవారి హితవాక్యాలు, మీరిద్దరూ జీవితంలో మరిచిపోదగినవికావు,'' అన్నాడు మందహాసంతో.

ఆ వెంటనే రవివర్మ, ''గురువర్యా! ఆ మహానుభావుడి హితవును విజయసింహుడు, ఆ గురుకుల ప్రాంగణం దాటుతూనే మరిచిపోయాడు. అందుకు కారణం, అతడి స్వార్థం తప్ప మరేమీ కాదు,'' అన్నాడు.

ఆ మాటలకు విశ్వనాధాచార్యుడు ఆశ్చర్యపోయి, విజయసింహుడికేసి చూశాడు.

ఇది గమనించిన విజయసింహుడు, ''ఆ నాస్వార్థం సంగతి, రవివర్మనే చెప్పనివ్వండి, గురువర్యా!'' అన్నాడు.

ఆచార్యుడు తల పంకించగానే రవివర్మ, ఆయనకు - విజయసింహుడు ధనాశతో స్వార్థంకొద్దీ మల్లుడు ముక్కంటి మీదా, దొంగల మీదా తన మంత్రశక్తిని ఉపయోగించాడంటూ వివరించి, ''గురువర్యా! ఇది



స్వార్థం, అధర్మం అనిపించుకోదా? సిద్ధేంద్రులవారి హితవచనాలను తోసిపుచ్చడం కాదా?'' అని అడిగాడు.

అందుకు ఆచార్యుడు ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా, ''వర్మా! ఇందులో విజయుడి స్వార్థం, అధర్మ ప్రవర్తన అంటూ ఏమీలేదు. నువ్వే వితర్కించి చూడు!'' అంటూ చిరునవ్వు నవ్వాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, విజయసింహుడు, తన గురువు చెప్పిన హితవును తోసిపుచ్చి,ధనాశకొద్దీ రెండుచోట్ల-మల్లుడు ముక్కంటిమీదా,దొంగలమీదా తనమంత్రశక్తిని ఉపయోగించాడు. ఇది స్వార్థం, అధర్మం అనిపించుకుంటుందిగదా? వాస్తవం ఇలా వుండగా, శాస్త్రజ్ఞాని అయినవిశ్వనాధాచార్యుడు,ఇందులో అలాంటి దేమీ లేదనడం వింతగా లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విజయసింహుడి ప్రవర్తనలో స్వార్థం, అధర్మం అంటూ ఏమీ లేదని విశ్వనాథాచార్యుడు చెప్పడం యుక్తియుక్తంగానే ఉన్నది. స్వార్థం అనే దానికి పరిమితులూ, మినహాయింపులూ ఉన్నవి. మహామల్లుణ్ణని విర్రవీగే ముక్కంటిని మంత్రశక్తితో ఓడించడం, స్వార్థం అనిపించుకోదు. ఇప్పటికే తనకు ఎదురు లేదని ఎంతో అహంతో విర్రవీగే ముక్కంటి ఇందులోనూ గెలుపొందితే, మృగంలా కన్నుగానని దురహంకారంతో ప్రవర్తించే అపాయం ఉన్నది. అందుకే అతన్ని మంత్ర శక్తితో ఓడించి అతని దురహంకారం అదుపులో ఉండేలా చేశాడు. ఇక దొంగల సంగతి. కత్తులు ఝళిపిస్తూన్న ఆ ముగ్గురు దొంగలూ ఎంతటి క్రూరకర్మలకైనా సిద్ధపడతారు. తమదగ్గరున్న ధనం ఇచ్చినా ప్రాణాలతో వదిలిపెడతారన్న నమ్మకం లేదు. తనకేగాక తన మిత్రుడి ప్రాణాలకు కూడా హాని కలిగించవచ్చు. ఆ అపాయాన్ని శంకించే విజయసింహుడు మంత్రశక్తిని ఉపయోగించాడు. ప్రాణరక్షణా ప్రయత్నంలో వైరిని చంపడం స్వార్థం అని పించుకోదు కదా? ఇక ధర్మం సంగతికొస్తే, సర్వకాల సర్వావస్థలలోనూ, ఏ మార్పూ లేని ధర్మం అంటూ ఉండదు. యుగయుగానికీ సామాజిక పరిస్థితులకు అనుగుణంగా అది మార్పు చెందుతూ ఉంటుంది. ఇక్కడ మరొక విషయం గమనించాలి. చిన్ననాటి గురువు చేసిన హితబోధను మరిచావని రవివర్మ అభియోగం చేసినప్పుడు, విజయసింహుడు సమాధానం చెప్పకుండా మౌనం వహించి, చిన్ననాటి గురువు దగ్గరికి తీసుకు వెళ్ళాడు. అంటే తాను చేసిన పనుల్లో స్వార్థం లేదని చెప్పినా, మిత్రుడు తప్పుచేసి సమర్థించుకుంటున్నాడనుకుంటాడే తప్ప అంత సులభంగా నమ్మడు. అందుకే ధర్మాధర్మాలు తెలిసిన విశ్వనాథాచార్యుడి దగ్గరికి తీసుకు వెళ్ళి, తను చేసిన పనిని గురించి రవివర్మచేతే చెప్పించాడు. అది అతని ధర్మబుద్ధినే చాటుతున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం: పి. పవన్‌కుమార్ రచన]



# అంధభిక్షువు కథ



అది వర్షాకాలం. బుద్ధుడు కొండసానువుల పాదతలంలో ఉన్న అందమైన గుహలో బసచేసి ఉన్నాడు. చుట్టుపక్కల ఉన్న గుహలలో ఆయన శిష్యులు చేరారు. దేశ విదేశాల నుంచి తరచూ పండితులు అక్కడికి వచ్చి, బుద్ధుడితో మతం గురించీ, తాత్విక సిద్ధాంతాల గురించీ చర్చలు జరిపేవారు. సందేహాలు తీర్చుకుని వెళ్ళేవారు.

ఒకనాటి సూర్యోదయ సమయంలో వాన జల్లుపడి వెలిసింది. ఉదయభానుడి లేత కిర ణాలు చుట్టుపక్కల బంగారు కాంతులను విర జిమ్ముతూ, వింతశోభను సమకూర్చసాగాయి. బుద్ధుడు గుహనుంచి వెలుపలికి వచ్చి,చుట్టు పక్కల కలయజూస్తూ,మెల్లగా ముందుకు నడవ సాగాడు. అక్కడున్న పండితులు కొందరు బుద్ధు డికి నమస్కరించారు. బుద్ధుడు ప్రతి నమస్కారం చేశాడు. వాళ్ళు ఆయన్ను సమీపించారు. వారిలో ఒక పండితుడు, ''మహాత్మా! ఒక సందేహం!'' అన్నాడు.

ఏమిటి అన్నట్టు మందహాసం చేస్తూ ముందుకు అడుగువేశాడు బుద్ధుడు.

''తమరు హింసకు వ్యతిరేకులే కదా?'' అని అడిగాడు పండితుడు ఆయన్ను అనుసరిస్తూ.

''అవును, అందులో సందేహం దేనికి?'' అని అడిగాడు బుద్ధుడు మెల్లగా తల తిప్పి.

''తమ శిష్యులలో ఒకడు ఇంతకుముందు, వందలకొద్ది చీమలను చంపాడు. ఇప్పుడేమీ జరగనట్టు ప్రశాంతంగా కూర్చున్నాడు చూడండి!'' అంటూ దూరంగా ఒక రాతిబండమీద కూర్చున్న ఒక వృద్ధ భిక్షువును చూపించాడు.

బుద్ధుడు ఒక క్షణం ఆ వృద్ధుడికేసి చూసి, ''అతడు ఒక్క చీమను కూడా చంపలేదు,'' అన్నాడు.

''అతడు చీమల్ని చంపడం నేనేకాదు; నా మిత్రులందరూ చూశారు. అతడు నడిచి వెళ్ళి నప్పుడు అతడి పాదాలకింద పడి వందలాది చీమలు నలిగి చచ్చాయి,'' అన్నాడు పండితుడు.

బిందుసార్



''చీమలు చచ్చిపోయిన మాట నిజమే. కాని ఆ వృద్ధ భిక్షువు వాటిని చంపలేదు,'' అన్నాడు బుద్ధుడు.

ఆ మాట అర్థంకానట్టు ఆశ్చర్యంగా చూశారు పండితుడూ, అతని మిత్రులూ.

''చూడు నాయనా! నువ్వు చెప్పే వృద్ధుడు కరుణాస్వభావుడు. అతని మనసులో ఇసుమంత హింసాభావం కూడా లేదు. అతడు హింసకు పాల్పడడం అసంభవం. అతడు చీమల చావుకు కారణం అయివుండవచ్చు. అయితే, అతడు వాటిని చంపలేదు. అతడు అంధుడు; నడిచేప్పుడు చీమలను చూడలేడు. మిత్రులారా! ఒక చర్య నిందించ తగినదా కాదా అన్నది కేవలం ఆ చర్యనుబట్టి గాకుండా, ఆ చర్యకు కారణమైన ఉద్దేశాన్నిబట్టేనిర్ణయించాలి,'' అని వివరించాడు బుద్ధుడు.

''అతడు కరుణాస్వభావుడు అంటున్నారు కదా? మరి, అలాంటివాడు దృష్టికోల్పోవడం విడ్డూరంగా లేదా?'' అని అడిగాడు మరొకపండితుడు.

''అతడు పూర్వజన్మలో చేసిన ఒక కార్యం కారణంగా ఈ జన్మలో అంధుడయ్యాడు. అయితే, అంధత్వం కారణంగా ఏర్పడిన బాధను అతడు ఎప్పుడో అనుభవించి ముగించాడు. ఇప్పుడు దృష్టి లేక పోయినప్పటికీ ఆనందస్థితిని అనుభవిస్తున్నాడు. అతడి అంతః నేత్రాలు తెరుచుకున్నాయి. అందుకే అతణ్ణి అందరూ చక్షుపాలుడు అని పిలుస్తారు,'' అన్నాడు బుద్ధుడు.

''మహాత్మా! ఈ జన్మలో దృష్టి కోల్పోవడానికి కారణమైన, పూర్వజన్మలో అతడు చేసిన పాప కృత్యం ఏమిటి?'' అని అడిగారు పండితులు.

దానికి బుద్ధుడు ఇలా చెప్పసాగాడు:

చక్షుపాలుడు గత జన్మలో గొప్ప వైద్యుడు. ఒకనాడు, కళ్ళు తెలియని కారణంగా ఎటు వెళ్ళడానికీ తోచక ఒక స్త్రీ వీధిలో అవస్థపడుతూ ఉండడం అతడు గమనించి, ''ఏమిటి సమస్య? ఎందుకలా అవస్థపడుతున్నావు?'' అని అడిగాడు.

''ఏదో మాయదారి జ్వరం వచ్చి కళ్ళు పోయాయి నాయనా. అక్కడక్కడా ఇంటిపనులు చేసి పొట్టపోసుకునేదాన్ని. ఇప్పుడు చూపు పోయింది. ఏ పనీ చేయలేను. గుడి దగ్గర కూర్చుని, అడుక్కుందామని బయలుదేరాను. అయినా అక్కడికి ఎటు వెళ్ళాలో తెలియడం లేదు. దారి చూపి పుణ్యం కట్టుకో నాయనా,'' అంటూ ప్రాథేయపడింది.

వైద్యుడు ఆమెను దేవాలయంకేసి నడిపిస్తూ, ''నేను నీ వ్యాధిని నయం చేయగలననుకుంటాను,'' అన్నాడు.

''అలాగా. నువ్వేగనక నాకు చూపు తెప్పిస్తే, నా జీవితాంతం మీ ఇంట్లో పనులు చేస్తూ పడి ఉంటాను,'' అన్నదా స్త్రీ పట్టరాని సంతోషంతో.

''నిజంగానా?'' అని అడిగాడు వైద్యుడు.

''ప్రమాణంచేసి చెబుతున్నాను,'' అన్నది స్త్రీ.

వైద్యుడు తన ఇంట్లో పనిమనిషి కోసం

కొన్నాళ్ళుగా చూస్తున్నాడు. సమయానికి ఈమె తారసపడడంతో చాలా సంతోషించాడు. ఆమె కంట్లో ఏదో ఔషధం చుక్కలు వేశాడు. కొంత సేపటికి ఆమెకు చూపు వచ్చింది.

చూపు పోవడానికి ముందు, ఆ స్త్రీ ధనికుడైన ఒక భూస్వామి ఇంటిపనులు చేసేది. ఇప్పుడు చూపు వచ్చిందిగనక, ఈ వైద్యుడింట పని చేయ డంకన్నా, ఆ ధనికుడి పంచ చేరడమే సుఖమని ఆమె భావించింది. ఎలాగైనా వైద్యుడి దగ్గరి నుంచి తప్పించుకోవాలని ఆలోచించి, "నువ్వు నా కళ్ళల్లో వేసిన మందు పనిచేసినట్టు లేదు. ఏదీ కనిపించడం లేదే," అంటూ కళ్ళు తెలియ నట్టే బాధ నటించింది.

ఆమె ముఖ కవళికలను జాగ్రత్తగా పరి శీలించి చూస్తూన్న వైద్యుడు, ఆమె అబద్ధం చెబుతున్నదని గ్రహించాడు. అతనికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. "నా ఔషధం పని చేయక పోవడమా? అవమానం! అవమానం! అయినా, మళ్ళీ ఒకసారి ప్రయత్నించి చూద్దాం!" అంటూ ఆమె కళ్ళల్లో వేరొక మందు వేశాడు.

ఆ మందుచుక్కలతో తన చూపు మరింత మెరుగు పడగలదని ఆశించి ఆనందించిన ఆ స్త్రీ, కళ్ళు అసలు కనిపించకపోవడంతో హడలి పోయింది.

"నా కంటి చూపు పోయింది, కంటి చూపు పోయింది," అంటూ విలపించసాగింది.

"దుర్మార్గురాలా! ఇప్పుడు కాదు. ఎప్పుడో పోయింది నీ కంటి చూపు. పోయిన చూపును తెప్పించడానికి ప్రయత్నించాను. అయితే సాధ్య పడలేదు. వెళ్ళు," అని అక్కడినుంచి కోపంతో వెళ్ళిపోయాడు వైద్యుడు.

చక్షుపాలుడి పూర్వజన్మ వృత్తాంతాన్ని విన్న పండితులలో ఒకడు, "ఆ స్త్రీ కపటబుద్ధిని గ్రహించిన కారణంగానే, వైద్యుడు తాను ఇచ్చిన చూపును మళ్ళీ వెనక్కు తీసుకున్నాడు. దానికి ఇంత పెద్దశిక్ష అనుభవించాలా?" అని అడిగాడు.

"మిత్రమా! ఆ స్త్రీ మూర్ఖత్వంకొద్దీ చూపు రానిదానిలా నటించింది. అయితే, వైద్యుడేమో ఆగ్రహంతో, ప్రతీకార ఆవేశంతో ఆపని చేశాడు. అది అతడు చేసిన మొదటి పాపం. రెండవ విషయం ఏమంటే - వైద్యుడు పవిత్రమైన తన వృత్తిధర్మాన్ని నేలరాచాడు. వ్యాధిని నయం చేయడం వైద్యుడి కర్తవ్యమే కాని, దానికి విరు ద్ధంగా ప్రవర్తించడం కాదు కదా?" అన్నాడు బుద్ధుడు.

"అర్థమయింది మహాత్మా! కృతజ్ఞతలు, గురుదేవా!" అంటూ పండితులు నమస్కరించి అక్కడినుంచి బయలుదేరారు.





# దొంగకాని దొంగ

మంచయ్య, చెడ్డయ్య ఇరుగుపొరుగున వుంటున్నారు. మంచయ్య పేదవాడేకానీ ఉన్నంతలో నలుగురికీ మంచి చెయ్యాలను కుంటాడు. చెడ్డయ్య ఉన్నవాడే కానీ తనకంటే ఎవరూ గొప్పగా వుండకూడదనుకుంటాడు.

ఒక రోజున చెడ్డయ్య ఇంటి ముందు నిలబడి వీధి కుక్క అదేపనిగా మొరగసాగింది. చెడ్డయ్యకు కోపం వచ్చి దాన్ని రాళ్ళతో కొట్టాడు. కుక్క పారిపోయి మంచయ్య ఇంటిముం దాగి అదేపనిగా మొరగసాగింది. కుక్కకు ఆకలిగా ఉన్నట్టుందని, మంచయ్య ఒక అరటి ఆకులో ఇంత అన్నం వేసి తెచ్చి, కుక్క ముందు పెట్టాడు. అది ఆ అన్నం తిని తోకా డిస్తూ మంచయ్యవంక కృతజ్ఞతగా చూసి వున్నట్టుండి మంచయ్య ఇంట్లోకి జొరబడి, పెరట్లోకి వెళ్ళి ఒకచోట ముందుకాళ్ళతో నేలమీదగట్టిగా గోకుతూ మట్టిని తొలగించ సాగింది.

వృద్ధురాలైన మంచయ్య తల్లి ఇది చూసి, "ఒరే, నీవల్ల కాలభైరవుడికి తృప్తి కలిగిన ట్లుంది. ఆయన ఏదో సందేశాన్నిస్తున్నాడు. అక్కడ తవ్వి చూడు, నాయనా!" అన్నది.

అది విన్న అతడి భార్య గునపం తెచ్చి వ్వగా, మంచయ్య ఆ ప్రదేశంలో తవ్వసాగాడు. ఎప్పుడు వెళ్ళిందో ఆ కుక్క మాయమయింది. కాసేపటికి మంచయ్యకు ఆ ప్రదేశంలో కొయ్యపెట్టె ఒకటి దొరికింది. అందులో బంగారు కాసులు, ఒక రాగిరేకు వున్నాయి. తన ముందుతరాలవారి సుఖసంతోషాల కోసం కొంత బంగారాన్ని అక్కడ దాచి వుంచి నట్లు, మంచయ్య తాతగారు రాసిన వాక్యా లున్నాయి - ఆ రాగి రేకు మీద.

"వసుంధర"

దాంతో మంచయ్య దశ తిరిగిపోయింది. అతడు మరొక నాలుగెకరాల పొలం కొన్నాడు. చిన్నవ్యాపారం ప్రారంభించాడు. ఇంటిల్లిపాదీ వైభవంగా జీవించసాగారు. అయితే, ఏ ఒక్కరూ మంచితనాన్ని మాత్రం విడిచిపెట్టలేదు!

ఉన్నట్టుండి మంచయ్యకు మంచిరోజులు రావడం చూసి, పొరుగునేవున్న చెడ్డయ్య భరించలేకపోయాడు. అతడు విషయమేమిటని ఆరా తీసి సంగతి తెలుసుకున్నాడు. వెంటనే గ్రామాధికారి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పి, "అయ్యా! భూమి లోపల ఏం దొరికినా అది రాజుగారికి చెందాలి కదా? మంచయ్య తన పెరట్లో బంగారం దొరికితే, అది తనేవుంచుకుని అనుభవిస్తున్నాడు!" అని ఫిర్యాదు చేశాడు.

గ్రామాధికారి ఈ విషయం దర్యాప్తు చేశాడు. అంతా తెలుసుకున్నాక ఆయన చెడ్డయ్యను పిలిచి, "మంచయ్య తాతగారు రాగి రేకు మీద వీలునామా రాసి, తన ఆస్తిలో కొంత బంగారాన్ని తన వారసులకిచ్చాడు. అందువల్ల ఆ బంగారం మంచయ్యకే చెందుతుంది," అని మందలించాడు.

ఇది విన్నాక చెడ్డయ్యకు ఇంకా కడుపు మండిపోయింది. అప్పుడతడికి కుక్క విషయంగుర్తుకొచ్చింది. ఆ రోజు కుక్క ఒకటి ఇంటి ముందు మొరిగితే, తను రాళ్ళతో కొట్టాడు. అది మహిమగల కుక్క అని మంచయ్యలా తను పసిగట్టలేకపోయాడు. అది ముందుగా తన ఇంటి ముందు మొరిగిందంటే, తన పెరట్లోనూ నిధి వుండే వుండాలి. ఆ కుక్క ఎక్కడుందో తనకెలా తెలుస్తుంది.

చెడ్డయ్య ఆ కుక్క కోసం గాలింపు ప్రారంభించాడు. అరటి ఆకులో అన్నం పెట్టుకొని



కుక్క కోసం ఎదురుచూడసాగాడు. అతడి పిసినారితనం తెలియడంవల్లనేమో, ఏ కుక్కా అతడింటి దరిదాపులకు రాలేదు. అయినా చెడ్డయ్య ఓపిగ్గా ఎదురుచూస్తూనే వున్నాడు.

అలా వారం రోజులు గడిచాక, ఒక కుక్క చెడ్డయ్య ఇంటిముందాగి మొరగసాగింది. కొంతకాలం క్రితం తను రాళ్ళతో కొట్టిన కుక్క అదేనని అతడు గుర్తించి, వెంటనే దానికి అన్నం పెట్టాడు. కుక్క అన్నం తిని తోకాడించి చటుక్కున అతడి ఇంట్లో దూరి, పెరట్లోకి వెళ్ళి ఒకచోట నేలను గోకింది. అక్కడ తవ్వితే చెడ్డయ్యకు పెద్ద కొయ్యపెట్టె దొరికింది. దాన్నిండా రత్నాలు, ముత్యాలు ఉన్నాయి. ఒక వజ్రాలహారం, నాలుగు బంగారు కంకణాలుకూడా ఉన్నాయి. పెట్టెలో రాగి రేకు ఏమైనా వుంటుందేమోనని తెగ వెతికాడు

చెడ్డయ్య. కానీ అలాంటిదేమీ దొరకలేదు. ఎందుకైనా మంచిదని చెడ్డయ్య తన తాతగారి పేరిట ఒక వీలునామాను రాగి రేకు మీద రాయించి దగ్గరుంచుకున్నాడు.

మంచివాళ్ళు వున్నది అనుభవించి ఆనందిస్తారు. చెడ్డవాళ్ళు తమ వైభవాన్ని ఇతరులకు చూపించడంలోనే ఆనందం పొందుతారు. ఆనాటినుంచీ చెడ్డయ్య ఇంట్లోనివారందరూ బంగారు ఆభరణాలు ధరించసాగారు. చెడ్డయ్య భార్య మెడలో వజ్రాలహారం వేసుకుని మురిసిపోసాగింది.

ఇలావుండగా–మారువేషంలో దేశసంచారంచేస్తూ ఆ దేశపు రాజు, ఆ ఊరు వచ్చాడు. అనుకోకుండా దేవాలయంలో చెడ్డయ్య భార్య మెడలోని వజ్రాలహారాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడాయన. ఆ హారం ఆయన పూర్వీకులది. సూర్యాస్తమయవేళ ఉద్యానంలో ఒంటరిగావున్న రాజు నాయనమ్మను ఒక దొంగ కొట్టి కొన్ని నగలతో పారిపోయాడు. వాటిలో ఈ వజ్రాలహారం కూడా వున్నది. రాజు తాతగారు, ఈ వజ్రాలహారం నమూనా గీయించి, దాన్ని దేశమంతా తిప్పించి చాటింపు వేయించాడు. కానీ దొంగ దొరకలేదు. ఆ దొంగను పట్టి శిక్షించేవరకూ తనకు ఆత్మశాంతి లేదంటూ కన్నుమూశాడాయన. రాజు తండ్రి కూడా ఆ హారం నమూనాను తనవద్ద వుంచుకుని, దొంగను పట్టడానికి విశ్వప్రయత్నాలు చేసి విఫలుడై, ఆ బాధ్యతను రాజుకు అప్పగించాడు. ఇప్పుడు రాజువద్ద ఆ నమునా వున్నది!

రాజు, గ్రామాధికారిని కలుసుకుని, తన మారువేషం తొలగించి, అతడికి విషయం చెప్పాడు. అక్కడా ఇక్కడా ఆరా తీయగా, చెడ్డయ్య సృష్టించిన దొంగ రాగి రేకువల్ల, చెడ్డయ్య తాతే దొంగ అని రాజు నమ్మి, చెడ్డయ్యతో, ''ఒరే, నీ తాతకు నువ్వు అన్నిటా వారసుడివి కనక, ఆ దుష్టుడు చేసిన పనికి నిన్ను శిక్షించక తప్పదు. అప్పుడే నా పూర్వీకులకు ఆత్మశాంతి లభిస్తుంది. వాడు దొరికి వుంటే ఉరిశిక్ష వేసి వుండేవాడిని. సరే, నిన్ను ఒక ఏడాది కఠిన కారాగారశిక్షతో విడిచిపెడుతున్నాను,'' అన్నాడు.

తను దురాశకుపోయి, ఇంటి పెరట్లో నిధి దొరికితే రాజుకు అందజేయకపోవడంవల్లా, లేని రాగి రేకును సృష్టించడంవల్లా – తను దొంగకాని దొంగనయ్యాను, అన్న పుట్టెడు దుఃఖంతో చెడ్డయ్య కారాగారానికి వెళ్ళాడు.






## ఎలుకలకు రక్షణ!



రాజస్థాన్‌లోని కార్నీదేవి ఆలయంలో ఎలుకలకు రక్షణ కల్పించబడుతోంది. అదీ ఎంతో భక్తిశ్రద్ధలతో. దేష్నాక్ గ్రామంలోని ఈ గుడిలో ఎలుకలకు ఆహారం అందిస్తారు. రక్షణ కల్పిస్తారు. భక్తితో చూస్తారు. గుడి ఆవరణలో ఎలుకలు యథేచ్ఛగా తిరుగుతూ ఉంటాయి. తగిన శరీరం కోసం వెతికే మానవ ఆత్మలు ఎలుకలలో తాత్కాలికంగా ఉంటాయని స్థానికులు విశ్వసిస్తారు.

దేష్నాక్‌లో వందలాది సంవత్సరాల క్రితం కార్నీదేవి అనే అద్భుత శక్తులుగల సన్యాసిని ఉండేది. ఒకానొకప్పుడు ఒక పసివాడు మరణించాడు. వాణ్ణి బతికించమని కార్నీదేవి దేవుణ్ణి ప్రార్థించింది. దేవుడు ఆమె కోరికను మన్నించాడు. అంతలో దురదృష్టవశాత్తు ఆ పసివాడి శరీరం దహనం చేయబడింది. అందువల్ల ఆ పసివాడి ఆత్మ తగిన మానవశరీరం లభించేంతవరకు ఎలుకగా బతికాడట. అప్పటినుంచి దేష్నాక్ ప్రజలలో ఎలుకలపట్ల గౌరవాదరాలు పెరిగాయి.

ఇదీ ఈ గుడికి సంబంధించిన కథ. ఈనాటికీ కార్నీదేవి ఆలయం ఎలుకల స్వేచ్ఛారాజ్యంగా వెలుగొందుతున్నది!

## తేనెలొలికే తేట·తెలుగు!



ఒక్కొక్క భాషకు ఒక్కొక్క ప్రత్యేకత ఉంటుంది. మధురగాంభీర్యం తెలుగుభాష విలక్షణ గుణం. తెలుగులో ప్రతి పదమూ అచ్చుతోనే అంతమవుతుంది. అందుకే భాష వినసొంపుగా ఉంటుంది. ఇలా అచ్చులతో ముగిసే పదాలుగల భాషలు ప్రపంచంలో రెండేరెండు ఉన్నాయి. ఒకటి తెలుగు; రెండవది ఇటాలియన్ భాష. అందుకే తెలుగుకు 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనేపేరు వచ్చింది.



# భూతాల విందు

గంపలగూడెం గ్రామంలో గయ్యాళిగా పెద్ద పేరుమోసిన గంగారత్నం, భర్త పోయాక, బతుకుతెరువుకోసం వంటపనిలోకి దిగింది. ఆమె వంట అద్భుతం అని గ్రామంలో అందరూ మెచ్చుకునేవారు. ఆ కారణంగా, ఆమె గయ్యాళి తనం ఎలావున్నా, శుభాశుభకార్యాలకు వంట పనులకు ఆమెను పిలిచేవారు.

ఒకనాటి అర్ధరాత్రివేళ గంగారత్నం మంచి నిద్రలో వుండగా, ఎవరో వీపు తట్టినట్లయి చప్పున కళ్ళు తెరిచింది. ఎదురుగా మూడు పొట్టి భూతాలు! వాటిని చూస్తూనే గంగారత్నం భయంతో కెవ్వుమన్నది.

"రత్తమ్మా! అంతపెద్దగా కెవ్వుమనకు, చుట్టు పక్కల కొంపల్లో జనం లేచేరు. భయపడకు. ఈ రోజు ఆదివారం, అమావాస్య మహాపర్వదినం కదా! వల్లకాడులో విందు చేసుకోవాలని అన్నీ సిద్ధం చేశాం. నువ్వు గిన్నెలు, గరిటెలు తీసుకుని వెంటనే వల్లకాటికి బయలుదేరు," అన్నవి భూతాలు.

"నాకు ఒంట్లో బాగోలేదు. మరొకళ్ళను చూసుకోండి," అన్నది గంగారత్నం.

ఆ జవాబుకు భూతాల కళ్ళు నిప్పుకణి కల్లా మండాయి. అవి కఠినంగా ఆజ్ఞాపిస్తు న్నట్టు, "నువ్వు కుంటీ గుడ్డీ సాకులు చెబితే, నిన్నే చితిలో కాల్చుకుని విందు చేసుకోగలం. ఊ, వల్లకాటికి బయలుదేరు!" అని భూతాలు గబ్బిలాలుగా మారి కిటికీలోంచి చీకట్లోకి ఎగిరి పోయాయి.

మరోమార్గం లేక గంగారత్నం ఒక గోతాంలో గిన్నెలూ, గరిటెలూ, పళ్ళాలు వేసుకుని బయలు దేరి, గ్రామం చివరవున్న ఒక పాడుబడిన ఇంటి అరుగుమీద కూర్చుని, ఈ భూతాల విందు నుంచి ప్రాణాలతో తిరిగి రాగలనా అన్న భయం పట్టుకుని శోకాలు ప్రారంభించింది.

మాచిరాజు కామేశ్వరరావు

ఆ సమయంలో, ఆ దారిని వెళుతున్న బాటసారి ఒకడు, ఆమెను చూసి దగ్గరకు వచ్చి, "ఏ ఇంటావిడవి? ఇంత అర్ధరాత్రి, ఈ ఆరు న్నొక్కరాగం ఏమిటి?'' అని అడిగాడు.

గంగారత్నం, బాటసారికి అంతా చెప్పి, "అయ్యా, ఆ భూతాలవిందు, నా తద్దినం భోజనానికి వచ్చినట్టుంది!'' అన్నది ఏడుస్తూ.

అదివిన్న బాటసారి ఆమెను ఓదార్చుతూ, "అమ్మా, నా పేరు సాంబుడు. పొరుగూరి జమీందారుగారి అమ్మాయి పెళ్ళికి వంటచేసి, మా ఊరు తిరిగి వెళుతున్నాను. నీ బదులు నేను వెళ్ళి, భూతాల విందుకు ఏర్పాట్లు చేస్తాను, సరేనా!'' అన్నాడు.

"అంతకన్నా కావలసిందేమిటి, బాబూ!'' అంటూ గంగారత్నం, గిన్నెలూ అవీ వున్న గోతాంను సాంబుడి నెత్తిన పెట్టి, "గ్రామం మధ్యలో వున్న రావిచెట్టు పక్కనే, మా ఇల్లు. తెల్లవారి సామానంతా మా ఇంటికి భద్రంగా చేర్చు,'' అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

సాంబుడు వల్లకాడు చేరేసరికి, భూతాలు మూడూ ఒక చిన్న రాళ్ళగుట్ట మీద కూర్చుని కబుర్లాడుతున్నవి. అవి సాంబుణ్ణి చూస్తూనే, "ఒరే అరే అబ్బీ, నువ్వెవడివి? ఆ రత్తమ్మెక్కడ?'' అని అడిగాయి.

ఆ ప్రశ్నకు సాంబుడు నిర్భయంగా, "రత్తమ్మత్తకు హఠాత్తుగా గణం పూనింది. ఈ గోతాం నా నెత్తినపెట్టి, సంగతి చెప్పి, 'వస్తున్నా, ఊడలమ్మ తల్లో!' అంటూ గ్రామం పొలిమేర్లలోకి పారిపోయింది,'' అని ఒకపక్కన రెండు రాళ్ళు పొయ్యిలా చేసుకుని, భూతాలిచ్చిన పచ్చిపచ్చి కూరలతో వంటపని ప్రారంభించాడు.

గంట గడిచేలోపల సాంబుడి వంట పూర్తయింది. వాడు చేసిన కోడికూర, రొయ్యల



పులుసు, రాగుల ముద్ద, జొన్న రొట్టెలు లొట్టలు వేసుకుంటూ తిన్నాయి భూతాలు.

ఆ తర్వాత అవి సాంబుడి వంటను మెచ్చుకుంటూ, "మేం బతికున్నప్పుడుకూడా ఇలాంటి విందుభోజనం ఎరగం, మెచ్చాం!'' అంటూ పక్కనే వున్న మర్రిచెట్టు తొర్రలోంచి, ఒక తోలుసంచీ తీసి సాంబుడికిచ్చి, తెల్లవారవస్తూండడంతో, తీతువుపిట్టలుగా మారి అరుచుకుంటూ ఎగిరిపోయాయి.

సాంబుడు, భూతాలిచ్చిన తోలుసంచీ విప్పి చూశాడు. లోపల కళ్ళుచెదిరే బంగారు కాసులు! లెక్కవేసి చూడగా సరిగ్గా వంద వున్నాయి.

వాడు, వంట సామానూ, బంగారు కాసుల సంచీతో గంగారత్నం ఇల్లు చేరేసరికి, ఆమె ఇంటిముందు కళ్ళాపి చల్లుతున్నది. సాంబుడు జరిగినదంతా ఆమెకు చెప్పి, "భూతాలు ఇచ్చిన

బంగారంలో సగం నీకు యిస్తాను,'' అంటూ సంచీమూతవిప్పబోయాడు.

గంగారత్నం చప్పున సంచీ లాగేసుకుని, ''ఇంకానయం! ఈ బంగారం నీకు ఎలా దొరికింది? నేను, నిన్ను భూతాలదగ్గరకు పంపినందువల్లనే కదా! అక్కడ నీ ముష్టి వంటకు ఇది చాలు,'' అంటూ సంచీలోంచి ఒక కాసు తీసి సాంబుడి చేతిలో పెట్టింది.

ఇది అన్యాయం అంటూ సాంబుడు గొడవ ప్రారంభించాడు. గంగారత్నం పెద్దగా అరుస్తూ, సాంబుణ్ణి నానా మాటలూ అనసాగింది. ఈ రచ్చ భరించలేని పొరిగింటి పుల్లయ్య, ''మీ తగువు తీర్చడం గ్రామపెద్ద వల్లనే అవుతుంది, పదండి!'' అంటూ, వాళ్ళిద్దర్నీ గ్రామపెద్ద దగ్గిరకు తీసుకుపోయాడు.

గ్రామపెద్ద జరిగినదంతా శ్రద్ధగా విని, ''అవును, ఆ బంగారం గంగారత్నానికే చెందాలి!'' అంటూ పుల్లయ్యచేత సంచీని గంగారత్నానికి ఇప్పించాడు.

ఇది చూసిన సాంబుడు బాధగా, ''గంగారత్నం గయ్యాళితనానికి జడిసి, పొరుగూరి వాడినైన నాకు అన్యాయం చేశారు,'' అన్నాడు గ్రామపెద్దతో.

దానికి గ్రామపెద్ద నవ్వి, ''తొందరపడకు!'' అంటూ సాంబుడికేసి చేయి చూపి, గంగారత్నంతో, ''గంగారత్నం! నీ గయ్యాళి మాటల ప్రకారం, నువ్వు పొరుగూరి సాంబుణ్ణి భూతాల దగ్గిరకు పంపావుగనక ఆ సంచీ నీదవుతుంది. అదే లెక్కన నిన్ను పుల్లయ్య నా దగ్గరకు తీసుకువచ్చాడు గనక, ఆ సంచీ పుల్లయ్యది కావాలికదా! ఏమంటావు?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేక గంగారత్నం, గ్రామపెద్దకూ, సాంబుడికీ క్షమాపణ చెప్పుకున్నది. అప్పుడు గ్రామపెద్ద, ''నోరున్నదని ఎడాపెడా మాట్లాడితే అది న్యాయం అయిపోదు గంగారత్నం!'' అని మెత్తగా చీవాట్లు పెట్టి, కాసుల్ని సాంబుడికిచ్చి, ''నీకు న్యాయంగా చెందవలసినదాన్ని తీసుకుని, మిగిలినవి ఆమెకు ఇవ్వు,'' అన్నాడు.

సాంబుడు, ''గిన్నెలూ అవి ఇచ్చి పంపినందుకు ఆమెకు సగం ఇచ్చి, కష్టపడినందుకు మిగిలినది నేను తీసుకుంటాను బాబూ! ఆమె సొమ్ము నాకు వద్దు,'' అంటూ సగం కాసులు గంగారత్నానికిచ్చాడు.

గంగారత్నం వాటిని తీసుకుని, సిగ్గుతో తలవంచుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయింది.





# ఉత్తమ కవి

పూర్వం కుంతలదేశాన్ని పాలించిన రాజవర్ధనుడు, గొప్ప కవిపండిత పోషకుడుగా పేరుపడ్డాడు. ఆయన స్వయంగా కవి కావటంచేత, తన దగ్గరకు వచ్చే కవుల కవిత్వంలోని గుణదోషాలను స్వయంగా పరిశీలించి, తగినవిధంగా నిర్ణయం తీసుకునేవాడు. కవులను ఆదరించేవాడు.

ఏడాదిపొడవునా కవులను, పండితులను ఆదరించటంతోపాటు, రాజవర్ధనుడికి మరొక అలవాటు వుండేది. ప్రతి ఏడూ శరన్నవరాత్రులలో, ఆయన సరస్వతీ పూజల్ని ఘనంగా నిర్వహించి, ఆ సమయంలో తనవద్దకు వచ్చిన కొత్తకవుల కావ్యాలన్నిటినీ పరిశీలించి, ఉత్తమంగా తోచిన కావ్యానికి విజయదశమి నాడు బహుమానం ఇచ్చేవాడు. ఆ కావ్యాన్ని రచించిన కవికి ఆ రోజున ఘనంగా సన్మానం జరిగేది. ఒక్కొక్కసారి, ఉత్తమ కావ్యాన్ని రచించినకవి, ఆస్థానకవిగా కూడా నియమించబడేవాడు.

ఒక సంవత్సరం సరస్వతీ పూజల వేళకు వచ్చిన కవుల కావ్యాల్లో, రామశర్మ, కృష్ణస్వామి అనే ఇద్దరు కవుల కావ్యాలు ఉత్తమ కావ్యాల పరిశీలనకు ఎన్నికయ్యాయి. రాజుతోబాటు ఆ కావ్యాల గుణదోషాల్ని పరిశీలిస్తున్న ఇతర కవులు, ''రామశర్మ కావ్యం, కృష్ణస్వామి కావ్యం కంటే ఉత్తమమైందని తోస్తున్నది, ప్రభూ! కృష్ణస్వామి కావ్యం అక్కడక్కడా రసగుళికల్లాంటి పద్యాలతో అద్భుతంగా వున్నమాట నిజమేకాని, వ్యాకరణ దోషాలూ, రసహీనమైన కవితా పంక్తులూ కూడా, అతడి కవిత్వంలో విస్తారంగానే చోటు చేసుకున్నవి. రామశర్మ కావ్యం ఆ రకంగా కాక, మొదటి

లక్ష్మీగాయత్రి

నుంచి చివరిదాకా ఏకరీతిగా బాగున్నది. అందుచేత, ఈ సంవత్సరం రామశర్మనే ఉత్తమ కవిగా ఎంపిక చేసి, అతడి కావ్యానికే బహుమతి ఇవ్వడం న్యాయం!'' అంటూ అభిప్రాయపడ్డారు.

కాని, రాజవర్ధనుడు చిరునవ్వుతో వారిని వ్యతిరేకిస్తూ, ''మీరు కావ్యాన్ని పరిశీలించేటప్పుడు, కవి జీవిత విధానాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి. అతడి పూర్వాపరాలు పరిశీలించాలి. రాజోద్యోగులద్వారా, ఈ ఇద్దరు కవుల గురించి నేను తెలుసుకున్నాను. రామశర్మ విద్యాధికుడు; ధనికుడు. ఇప్పటికే ఒక జమీందారు ప్రాపకంలో వున్నవాడు. అతడి గ్రామం సస్యశ్యామలంగా పచ్చని పైరుపంటలతో కళకళ్ళాడే ప్రదేశం. అన్ని సౌకర్యాలూ, అర్హతలూ వున్నవాడు, ఈ మాత్రంగానే రాయగలిగాడంటే అతడిలో భావావేశపు పాలు అంతంతమాత్రంగానే వున్నదన్నమాట! ఇక కృష్ణస్వామి కేవలం కృషీవలుడు. అంతంత మాత్రపు విద్యార్హతలతో కుటుంబం కోసం రోజూ శ్రమజీవనం సాగిస్తున్న అతడి నివాస ప్రాంతంలో చవిటినేలలు అధికం. నాలుగు వంతులు శ్రమిస్తే ఒకవంతు ఫలందక్కే చోటు. అయినప్పటికీ అతడు రసగుళికల్లాంటి పద్యాలు రాయగలిగాడంటే, అతడి హృదయాంతరాళంలోని భావఝరి, పర్వతకఠినమైన అతడి జీవనశైలిని సైతం చీల్చుకుని పైపైకి ఎగసిపడుతున్నదన్నమాట! అటువంటివాడికి మనం సౌఖ్యాన్నీ, సౌకర్యాన్నీ కల్పిస్తే, అతడు మరింత అద్భుతమైన కవిత్వాన్ని సృష్టించగలుగుతాడు. ఇక వ్యాకరణంలాంటివాటిమాటకొస్తే-రచనకు తగినంత సమయం, రాసిన దానిని పునఃపరిశీలించే వ్యవధీవుంటే సరిపోతుంది. ఇప్పుడు చెప్పండి, ఈయేడు ఎవరిని ఉత్తమకవిగా ఎంపికచేద్దాం? ఏది ఉత్తమకావ్యం?'' అంటూ ప్రశ్నించాడు.

రాజు మాటలతో తమ తప్పు గ్రహించిన కవులంతా ఏకగ్రీవంగా, ''కృష్ణస్వామే ఉత్తమ కవి!'' అంటూ తీర్మానించారు.

రాజవర్ధనుడు, కృష్ణస్వామిని సన్మానించి, ఉత్తమకవిగా గౌరవించి, అప్పటికప్పుడు ఆస్థానకవిగా నియమించాడు.



## హడలెత్తించిన అతిథులు!




బ్రెజిల్ రాజధాని రియో డీ జనీరోలోని ఒక హోటల్‌కు వెళ్ళాలంటే మామూలుగా ముందుగానే టేబుల్స్ రిజర్వ్ చేసుకోవాలి. ప్రయాణీకులు కూడా తరచూ వచ్చి తిని వెళుతూంటారు. గత ఆగస్టు నెలలో ఒకనాడు రెండు జాగువార్లు అనే అమెరికా చిరుత పులులు ఆ హోటల్ లోపలికి జొరబడి, మేజాలమధ్య యథేచ్ఛగా తిరగసాగాయి. వాటిని చూసి, కూర్చున్నవాళ్ళూ, హోటల్ సిబ్బందీ హడలిపోయి కేకలుపెట్టారు. అలా చేయడం వాటికి ఏమాత్రం ఆనందం కలిగించినట్టు లేదు. మేజామీది పళ్ళాలనూ, గ్లాసులనూ కిందపడదోసి పగలగొట్టాయి. అంతలో హోటల్ మేనేజర్ స్థానిక పర్యావరణ శాఖాధికారులకు తెలియజేయడంతో, వాళ్ళ వాలంటీర్లు వచ్చి, జాగువార్లను మచ్చికచేసి, బోనుల్లోకి వెళ్ళేలా చేశారు. గండం గడిచింది!

## కుక్కల కోసం

జపానులోని అకాగీ నీగో అనే ఒక సంస్థ ప్రత్యేకమైన ఐస్‌క్రీమ్‌ను తయారుచేస్తున్నది. అది ఎవరికోసం అనుకున్నారు? కుక్కల కోసం! దానికి ప్రత్యేకంగా పేరేదీ పెట్టలేదు కాని, కప్పు మీద 'డాగీస్ ఐస్‌క్రీమ్' అని ఉంటుంది. మామూలు ఐస్‌క్రీమ్‌లో ఉన్న 'లాక్టోస్' కుక్కలకు అంత సులభంగా జీర్ణంకాదట. ఇప్పుడు కుక్కలకని తయారుచేసిన ఐస్‌క్రీమ్‌లో లాక్టోస్‌ను తొలగించారు. ఈ ఐస్‌క్రీమ్‌ను మనుషులు కూడా హాయిగా తినవచ్చునని ఆ తయారీసంస్థ తెలియజేస్తున్నది. ఇందులో తియ్యదనం అంతగా ఉండదు కాబట్టి మధుమేహ వ్యాధిగ్రస్తులు కూడా తీసుకోవచ్చునని ఆ కంపెనీ చెబుతోంది. అయినా ఈ ఐస్‌క్రీమ్‌ను రుచి చూడడానికి జనం వెనుకాడవచ్చు. ఎందుకంటారా? 3.3 ఔన్సుకప్పు ఐస్‌క్రీమ్ ధర 15 డాలర్లు అంటే 750 రూపాయలు!



# మధ్యప్రదేశ్ జానపద కథ

మధ్యప్రదేశ్ రాష్ట్రం, దాని పేరే సూచిస్తున్నట్టు మనదేశానికి నడిబొడ్డున ఉంది. ఖనిజసంపదకు నిలయమైన ఈ రాష్ట్రం పుష్కలమైన సహజవనరులకూ, వన్య సంపదకూ కూడా పేరుగాంచింది.

ప్రధానంగా వింధ్య, సత్పురా పర్వతశ్రేణులతో పరివేష్ఠించబడిన పీఠభూమి ఇది. నర్మద, తపతి, చంబల్, సోనే, మహానది, ఇంద్రావతి మొదలైన నదులు ఈ పర్వతాల నుంచి ఆవిర్భవించి, రాష్ట్రం గుండా ప్రవహిస్తూ, నేలను సుభిక్షం చేయడంతో పాటు ప్రకృతి సౌందర్యాన్ని ప్రసాదిస్తున్నాయి.

ఒకనాటి సంస్థానాలు ఈనాడు మధ్యప్రదేశ్ రాష్ట్రంలో అంతర్భాగాలయ్యాయి. 1820 తరవాత బ్రిటిష్‌వాళ్ళు ఆక్రమించుకున్న ఈ ప్రాంతాన్ని కేంద్రపరగణా 'సెంట్రల్ ప్రావిన్స్' అని పిలిచేవారు. స్వాతంత్ర్యానంతరం 1956 లో మధ్యప్రదేశ్‌రాష్ట్రం ఏర్పాటయింది. ఇందులో నుంచి 2001 లో చత్తీస్‌ఘడ్ అనే నూతన రాష్ట్రం విడదీయబడింది.

3,08,000 చ.కి.మీ వైశాల్యం గల మధ్యప్రదేశ్ జనాభా 6,03,85,118. హిందీ ప్రధాన భాష. భోపాల్ రాజధానీ నగరం.

మధ్యప్రదేశ్‌లో పలు తెగల గిరిజనులు నివసిస్తున్నారు. గోండ్లు, భిల్లులు, ఓరాన్లు, ధంకాలు, ధన్‌ఘుడ్‌లు, పణికాలు, సహోరియాలు వారిలో ముఖ్యమైనవారు.

## తండ్రిని రక్షించిన తనయుడు!

ఒకానొకప్పుడు వింధ్యపర్వత ప్రాంతంలో రెండు గోండురాజ్యాలు ఉండేవి. ఒక రాజ్యం పేరు పాళినాగ్రి. ధైర్యసాహసాలకు పేరుగాంచిన సింఘీ సూర్వా దానిని పాలించేవాడు. ఆయనకు కొన్ని అద్భుతశక్తులు కూడా ఉండేవి. ఆయన సాహసకృత్యాలను కీర్తించే జానపదగేయాలు ఈ నాటికీ గోండులు పాడుకుంటారు. రెండవ గోండు రాజ్యమైన బీరార్‌ను చందాకోట నుంచి భోగిబిలుడనే రాజు పాలించేవాడు.

సింఘీ సూర్వాకు లేకలేక ఒక కొడుకు



పుట్టాడు. వాడికి పాళి అని పేరుపెట్టి, అల్లారు ముద్దుగా పెంచసాగారు. పాళి పసిబిడ్డగా ఉన్నప్పుడే అసమానశక్తులను అమిత నైపుణ్యంతో ప్రదర్శించసాగాడు. వాణ్ణి చూసి సింఘీ రాజ దంపతులు పొంగిపోయేవారు. పాళీకి ఐదేళ్ళు నిండేసరికి సింఘీ, కుమారుడికి పెళ్ళి చేయాలని తగిన వధువుకోసం వెదకసాగాడు. ''మన పాళీకి సాధారణ రాజకుమారి చాలదు. వాడి లాగే వాడి కాబోయే భార్యకూడా అసాధారణ ప్రజ్ఞ గల అమ్మాయిగా ఉండాలి,'' అని తరచూ రాణితో చెప్పేవాడు.

చారులు ఒకనాడు, ''బేరార్ రాజు భోగి బిలుడి కుమార్తె చిన్నారి గైలా కూడా మన యువ రాజులాగే అసాధారణ ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శిస్తున్నది,'' అని చెప్పారు.

ఆ మాట వినగానే సింఘీ రాజు అమితానందంచెంది, స్వయంగా వెళ్ళి బేరార్ రాజుతో పెళ్ళి సంబంధాలు మాట్లాడాలని నిర్ణయించాడు.

మరునాడే హంసధార అనే తన అశ్వాన్ని అధిరోహించి, సింఘీ, బేరార్‌కు బయలుదేరాడు. హంసధార చాలా బలమైనదీ, విశ్వాసం కలిగినదీమాత్రమే కాదు; దానికి ఆకాశంలో ఎగరడం, మానవభాషలో మాట్లాడడం లాంటి అద్భుత



శక్తులు కూడా ఉండేవి.

చందాకోటను సమీపించిన సింఘీ, ఉద్యానవనంలో కొంతసేపు విశ్రాంతి తీసుకుని వెళదామనుకున్నాడు. గుర్రంపై నుంచి దిగి ఒక చెట్టు నీడలో కూర్చున్నాడు. ప్రయాణపు బడలిక కారణంగా, చల్లని గాలి వీచడంతో చెట్టుబోదెకు ఆనుకుని అలాగే నిద్రపోయాడు. ఒక్కొక్కసారి

## చరిత్ర

మధ్యప్రదేశ్ చరిత్ర, సుదీర్ఘమూ, సుసంపన్నమూ అయినది. మధ్యప్రదేశ్‌లోని ఉజ్జయిని నుంచే అశోకుడు తొలుత రాజయ్యాడు. క్రీ.శ.300 నుంచి 550 వరకు ఇది గుప్తుల సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. ఏడవ శతాబ్దంలో హర్షవర్ధనుడి సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. 11వ శతాబ్దారంభంలో ఈ ప్రాంతాన్ని ముస్లింలు ఆక్రమించారు. 16వ శతాబ్దాంతం వరకు ఇక్కడ మొగలుల పాలన జరిగింది. కొంతకాలం మహారాష్ట్రులు దీనిని పాలించారు. ఆ తరవాత అది బ్రిటిష్‌వారి వశమయింది. ఇండోరుకు చెందిన రాణి అహల్యాబాయి హోల్కర్, రాణి దుర్గావతి, రాణి కమలాదేవి మొదలైన సుప్రసిద్ధ రాణులు సమర్థవంతమైన పరిపాలన సాగించి చరిత్రలో తమ కంటూ ప్రత్యేకస్థానం సృష్టించుకున్నారు.

నిద్రకు ఉపక్రమించాడంటే కొన్నిరోజులపాటు అలాగే నిద్రపోయే స్వభావం ఆయనది. యజమాని రాత్రయినా లేవకపోయేసరికి, అశ్వం హంసధార ఉత్సాహంకొద్దీ ఉద్యానవనమంతా గెంతులు వేసి, పూలమొక్కలనూ, ఫలవృక్షాలనూ నాశపరిచింది.

తెల్లవారగానే కాపలాభటులు ఈ సంగతి భోగిబిలరాజుకు చెప్పగానే ఆయన ఆగ్రహం చెంది, "ఎవడా పొగరుబోతు అశ్వికుడు? వెంటనే ఇక్కడికి తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

భటులు వెళ్ళి సింఘీ రాజును తట్టి, కుదిపి నిద్రలేపారు. ఆవులిస్తూ కళ్ళు తెరిచి చూసిన సింఘీ, 'నేను పాళినాగ్రి రాజును. మీ రాజుతో వియ్యమందడానికి వచ్చాను," అంటూ మళ్ళీ ఆవులిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

భటులు తిరిగి వెళ్ళి తమ రాజుకు ఆ మాట చెప్పగానే, ఆయన పట్టరాని ఆగ్రహావేశంతో, "ఛీ! ఈ బిచ్చగాడికొడుక్కా నా మరాలుపట్టినివ్వడం? వెంటనే సేనలను సమాయత్తం చేయండి. వారంలోగా దండెత్తి వస్తున్నట్టు, చెట్టుకింద నిద్రపోతూన్న ఆ మూర్ఖుణ్ణి హెచ్చరించండి," అని ఆజ్ఞాపించాడు.

భటులు మళ్ళీ ఉద్యానవనానికి వెళ్ళి, సింఘీతో చెప్పినా ఆయన ఆ మాట వినిపించుకోలేదు. ఒకవారం వరకు మూసిన కన్ను తెరవకుండా కుంభకర్ణుడిలా నిద్రపోయాడు. ఎనిమిదవరోజు భోగిబిలుడి సేనలు వచ్చి చుట్టూ మోహరించాక, కళ్ళుతెరిచి, ఆవులిస్తూ ఒళ్ళు విరుచుకుని ఒకసారి చుట్టూ కలయజూశాడు. వెంటనే అతీతశక్తులను ఆవాహన చేశాడు. మరుక్షణమే దెయ్యాలూ, పిశాచాలూ, రాక్షసులూ, గబ్బిలాలూ, రాబందులూ, క్రూరమృగాలూ అసంఖ్యాకంగా పుట్టుకువచ్చాయి. బేరార్ సేనలను చీల్చి చెండాడి సమూలంగా నిర్మూలించి వెళ్ళిపోయాయి.

## కళలు - హస్తకళలు



చాలా సునిశితంగా నేయబడే చీరలకు మధ్యప్రదేశ్ పెట్టింది పేరు. చందేరి, మహేశ్వరి ప్రత్తి, పట్టు చీరలు ప్రపంచ ప్రసిద్ధిగాంచాయి. పట్టు, ప్రత్తి కలయికతో నేయబడే మహేశ్వరి చీరలు సింపుల్ డిజైన్‌కూ, రంగుల కలయికకూ పేరుగాంచాయి.

గవ్వలు, పూసలు, ఈకలతో తయారయ్యే ప్రాచీన ఆభరణాలను గిరిజనులు ధరిస్తారు. ఇవి చక్కని పనితనంతోనూ, విలక్షణంగానూ ఉంటాయి. బంగారం, వెండి, కంచు, ఇంకా మిశ్రమ లోహాలతోనూ రకరకాల ఆభరణాలు తయారుచేస్తారు.

లోహాలతో తయారుచేసే అలంకార పేటికలు, దీపాలు, అన్నం గిన్నెలు, అలంకార వస్తువులు మొదలైనవాటికి కూడా ఈ రాష్ట్రం పేరుగాంచింది. గ్వాలియర్‌లో తయారయ్యే బొమ్మలకు అంతర్జాతీయ ఖ్యాతి లభించింది. వివిధ తెగల గిరిజనులు చిత్రించే పితోరా, లిపాయ్ వంటి కుడ్యచిత్రాల శైలీ పద్ధతులు చాలా ప్రసిద్ధిగాంచాయి.

ఆఖరికి భోగిబిలుడే యుద్ధరంగానికి వచ్చి సింఘీతో ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు.

సింఘీ గుర్రం అధిరోహించి సమరోత్సాహంతో కత్తిదూశాడు. ఒకరికొకరు తీసిపోకుండా ఇద్దరు వీరులూ పోరాడసాగారు. ఆ రోజంతా యుద్ధం చేశారు. మరునాడు యుద్ధం చేశారు. మూడవ రోజు యుద్ధం చేశారు. నాలగవరోజు యుద్ధం చేస్తూన్నప్పుడు సింఘీ ఎక్కిన గుర్రం హఠాత్తుగా పక్కకు ఒరిగిపోయి సకిలించసాగింది. సింఘీ పట్టుతప్పి పక్కనున్న పల్లంలోకి పడిపోయాడు. రాజులు ఇద్దరూ రాత్రుల్లో విశ్రాంతి తీసుకుంటూన్న సమయంలో భోగిబిలుడి భటులు రహస్యంగా ఆ గోతిని తవ్వి, పైకి కనిపించకుండా కప్పి ఉంచారు.

భోగిబిలుడు విజయగర్వంతో చేసిన వికటాట్టహాసం కోటలోనూ, చుట్టుపక్కల కొండలలోనూ ప్రతిధ్వనించింది. భటులు సింఘీని గొలుసులతో బంధించారు.

తన యజమానిని భటులు లాక్కుపోవడం చూసి అడ్డుకోవడానికి హంసధార అశ్వం ప్రయత్నించింది. కాని ఫలితం లేకపోయింది. అద్భుత శక్తులను సంవత్సరానికి ఒక్కసారే ఉపయోగించుకోవాలనే నియమం ఉండడంవల్ల సింఘీ మళ్ళీ వాటిని ప్రయోగించలేకపోయాడు.

"ఆఖరిసారిగా నీ రాజు ముఖం చూసుకో. ఆయనకు అంత్యక్రియలు జరుపుకోమని ఆయన భార్యాబిడ్డలకు వెళ్ళి చెప్పు!" అంటూ భటులు గుర్రాన్ని అక్కడి నుంచి తరిమికొట్టి రాజును చీకటి కొట్టులో పడవేశారు.

అశ్వం పట్టరాని విషాదంతో పాళీనాగ్రికి తిరిగివెళ్ళి, రాణితో, "రాజుగారు ఇక లేరు!" అన్నది. పిడుగుపాటులాంటి ఆ వార్త వినగానే రాణి దుఃఖంతో స్పృహతప్పి పడిపోయింది. అయితే పక్కన ఉన్న పసివాడు పాళీబీర్వా ఏమాత్రం చలించకుండా, అశ్వం నుంచి బేరార్‌లో



జరిగినదంతా అడిగి తెలుసుకున్నాడు. ఆ తరవాత తల్లికేసి తిరిగి, "అమ్మా! నువ్వు మహారాణివి! రాణులకు ఇలాంటి హృదయ దౌర్బల్యం పనికి రాదు," అని ఓదార్చి, "హంసధార నా తండ్రి శవాన్ని చూడలేదు గనక, ఆయన మరణించి ఉండరు. ప్రాణాలతోనే ఉంటారు. నేను వెళ్ళి బేరార్ రాజును జయించి నాన్నను వెంటబెట్టుకు వస్తాను," అన్నాడు.

"నువ్వు మరీ పసివాడివి నాయనా! మీ తండ్రి ఓడిపోయినచోట నువ్వెలా గెలుపొందగలవు?" అని కన్నీళ్ళు కార్చింది తల్లి.

"శత్రువుల మోసకృత్యాలు నా దగ్గర చెల్లవు. తప్పక జయిస్తాను, విచారించకు," అని తల్లికి చెప్పి తన బుల్లి బంగారుకత్తినీ, డాలునూ తీసుకుని, మరికొన్ని వస్తువులను మూటగా కట్టి వీపుకు తగిలించుకుని గుర్రం ఎక్కి కూర్చుని, "పద, మిత్రమా! నువ్వు నా తండ్రిని చివరగా చూసిన స్థలానికి నన్ను చేర్చు," అన్నాడు.

## ఆలయాలు - స్థూపాలు



శిల్పకళా వైభవానికి మధ్యప్రదేశ్ విశ్వవిఖ్యాతిగాంచింది. ముఖ్యంగా ఖజురహో దేవాలయాలను గురించి ఇక్కడ చెప్పుకోవాలి. అద్భుతమైన శిల్పాలతో విలక్షణంగా విరాజిల్లుతూ అందరి దృష్టినీ ఆకర్షించే 85 ఆలయాల సముదాయం ఇది. మరో సుప్రసిద్ధమైన స్మారకచిహ్నం సాంచీ స్థూపం. దీనిని అశోకచక్రవర్తి నిర్మించాడు. కప్పు ఎత్తుగా ఉన్న ఓర్చాలోని భవనాలూ, కుడ్యశిల్పాలూ, చిత్రాలూ భారతీయ శిల్పకళకు అపూర్వ అలంకారాలు. అంతగా ప్రసిద్ధంకాని అనేక సుందర భవనాలు మధ్య ప్రదేశ్‌లో చాలా ఉన్నాయి.

హంసధారకు మనసు ఉప్పొంగింది, యువ రాజు చెప్పింది నిజమేనేమో! ఆయన తండ్రిని విడిపించగలడేమో! అన్న ఆశతో, విశ్వాసంతో ముందుకు సాగింది. యువ రాజును అక్కడికి త్వరగా చేర్చడం అవసరమని భావించి, రెక్కలు విప్పి ఆకాశవీధిలో వాయువేగంతో ఎగరసాగింది.



సగం దూరం వెళ్ళాక దాహం వేయడంతో, దప్పికతీర్చుకోవడానికి ఒక నదీతీరంలో దిగారు. పాళీ నీళ్ళు తాగబోతూండగా పాము బుసకొట్టే శబ్దమూ, పక్షిపిల్లలు భయంతో అరిచే ధ్వనులూ వినిపించాయి. పాళీ తలెత్తి చూశాడు. గట్టు మీద ఉన్న పెద్దచెట్టు గూట్లో ఉన్న రెండు పక్షి పిల్లలను పట్టి తినడానికి ఒక పెద్ద త్రాచుపాము చరచరా వెళుతున్నది.

''యువరాజా! వెళ్ళి ఆ పక్షి పిల్లలను రక్షించు. రాజ్యంలోని సాధుజంతువులనూ, పక్షులనూ రక్షించడం రాజకుమారుడిగా నీ బాధ్యత!'' అని సలహా ఇచ్చింది హంసధార.

పాళీ క్షణంలో చెట్టెక్కి, కత్తితో త్రాచు పాము తలను తెగ నరికాడు. అప్పుడే అక్కడికి ఒక పెద్ద రాబందు వచ్చి వాలి, ''యువరాజా! కృత జ్ఞతలు. దుర్మార్గురాలైన ఆ పాముబారి నుంచి నా బిడ్డలను రక్షించావు. ఇంతవరకు నా పది మంది పిల్లలను అది పొట్టన పెట్టుకున్నది. నీ పుణ్యాన ఇకపై మాకు పాము బెడద తప్పింది. నీ ప్రయాణం విజయవంతం కావాలని కోరు కుంటున్నాను. నా శక్తీ ఈ అడవిలోని జంతువు

లన్నిటి శక్తీ ఎప్పుడూ నీ వెంట ఉంటుంది!'' అని వరమిచ్చింది.

ఆ తరవాత యువరాజు దాహం తీర్చుకుని గుర్రాన్నెక్కి ప్రయాణాన్ని కొనసాగించాడు. బెరార్ రాజోద్యానం చేరేసరికి సూర్యాస్తమయం కావడంతో, ''రాత్రికి ఇక్కడే పడుకుని, ఉదయమే వెళ్ళి భోగిబిలుణ్ణి యుద్ధానికి పిలుస్తాను,'' అనుకుని తనవెంట తెచ్చిన బంగారు పరదాను విప్పి, గుడారం ఏర్పాటుచేసి, దానికింద బంగారు, ముత్యాలపరుపు పరిచి, దానిమీద పీతాంబరాలు వేసి పడుకున్నాడు.

రాజభవనం ఉపరిభాగం నుంచి ఉద్యాన వనంలోని వింత కాంతిని గమనించిన రాజూ, ఆయన పరివారం అది ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపోయారు.



మరునాటి వేకువజామున దాన్ని గురించి తెలుసుకోవడానికి రాజు భటులను పంపడానికి ముందే పాలీ, కోటప్రాంగణానికి చేరి, యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు. ఉద్యానవనం బావిమీద కప్పబడిన వృత్తాకార లోహఫలకాన్ని లాగి, కోట లోని రాజభవనంలోకి వేగంగా విసిరాడు. అది రివ్వుమంటూ పోయి పలువురిని గాయపరి చింది. భోగిబిలుడు, ఆ కుర్రవాడి మీదికి వెళ్ళ మని భటులను ఆజ్ఞాపించాడు.

అయితే, అశ్వం శరవేగంతో వెళ్ళి భోగిబిలుణ్ణి చుట్టుముట్టింది. పాలీ కత్తిదూసి ఒక్క వేటుతో భోగిబిలుడి తలను తెగనరికాడు. రాజు మరణంతో హడలిపోయిన సైనికులు పాలీ శరణుజొచ్చారు. వాళ్ళు పాలీని ఆయన తండ్రి ఉన్నచోటికి తీసుకువెళ్ళారు. తండ్రి, కుమారుణ్ణి ఆనంద బాష్పాలతో కౌగలించుకున్నాడు. ఆ తరవాత తండ్రీ కొడుకులు భోగిబిలుడి కుమార్తె గైలాను వెంటబెట్టుకుని, హంసధారను అధిరోహించి, భటుల విజయధ్వానాలతో తమ రాజధానికి తిరుగుప్రయాణమయ్యారు.

## పన్నా వజ్రాల గనులు

భారతదేశానికి వజ్రాలదేశంగా శతాబ్దాల చరిత్ర ఉంది. దక్షిణాఫ్రికాలో వజ్రాలను కనుగొనేంతవరకు, ప్రపంచానికంతటికీ మనదేశం నుంచే వజ్రాలు సరఫరా అయ్యేవి. మనదేశంలోని ఏకైక వజ్రాల గని మధ్యప్రదేశ్ పన్నాజిల్లా మజ్‌గవాన్‌లోనే ఉంది. ఇక్కడ పదిలక్షల క్యారట్ డైమండ్లు ఉన్నట్టు 'ఇండియన్ బీరో ఆఫ్ మైన్స్' అంచనా. ప్రస్తుతం భారత ప్రభుత్వం అజమాయిషీలో పనిచేసే జాతీయ ఖనిజ అభివృద్ధిసంస్థ ఇక్కడ వజ్రాల తవ్వకం పనులు నిర్వహిస్తున్నది. జిల్లా వ్యాప్తంగా దాదాపు 80 కి.మీ. వజ్రాల గనులు విస్తరించి ఉన్నాయి.

# మనదేశం గురించి తెలుసుకుందాం

మనదేశంలో ఉన్నన్ని పండుగలు మరేదేశంలోనూ లేవనిపిస్తుంది. ఎక్కువ మతాలకు మనదేశం జన్మస్థానం కావడం; మనదేశానికి వచ్చే ఇతర మతాలవారిని ఆదరించడం; అందుకు కారణాలు కావచ్చు. సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ నెలలలో మరీ ఎక్కువగా పండుగలు వస్తాయిగనక ఈనెల క్విజ్ మనపండుగల గురించి. వీటిలో మీకు ఎన్నింటికి సమాధానాలు తెలుసో, చదివి చూడండి మరి.

1. దసరా ఉత్సవాలకు పేరుగాంచిన దక్షిణభారత నగరం ఏది.? ఆ వేడుకల ప్రత్యేకత ఏమిటి?
2. ఆలయరథాలు బయలుదేరేముందు, మహారాజావారు వీథులను చిమ్మే సంప్రదాయం ఏ ఉత్సవంలో పాటిస్తారు? అది ఎక్కడ జరుగుతుంది?
3. ఈ పండుగ సందర్భంగా ఒక రాష్ట్రంలో గాలిపటాలు ఎగురవేస్తారు, మరొక రాష్ట్రంలో పొంగళ్ళు పెడతారు. పండుగ పేరేమిటి? రాష్ట్రాలు ఏవేవి?
4. ప్రవక్త మహమ్మదు కుమారుడు హుస్సేన్ వీరమరణాన్ని ముస్లింలు కొందరు పాటిస్తారు. ఆరోజు పేరేమిటి?
5. ఫర్వదీన్ నెలలో (ఆగస్ట్-సెప్టెంబర్) పార్సీలు జొరాస్టర్ జన్మదినోత్సవాన్ని జరుపుకుంటారు. దాని పేరేమిటి?
6. మదురైలో జరిగే చైత్రోత్సవం ప్రాముఖ్యత ఏమిటి?
7. చెన్నయ్ మహానగరంలో జనవరి/ఫిబ్రవరి నెలలో జరిగే ఒక ముఖ్యమైన దేవాలయ ఉత్సవ సందర్భంగా అమ్మవారిని అందంగా అలంకరించిన రథంలో ఊరేగిస్తారు. ఏ దేవాలయంలో? అమ్మవారి పేరేమిటి?
8. హోలీని గోవాలో వేరొక పేరుతో పిలుస్తారు. ఆ పేరేమిటి?

(సమాధానాలు వచ్చేసంచికలో)

## సెప్టెంబర్ క్విజ్ సమాధానాలు

1. మేఘనాథ్ సాహా.
2. బిషప్ కాటన్.
3. బృహస్పతి.
4. ఆర్యభట.
5. థామ్సన్ కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్.
6. రూర్కీ యూనివర్సిటీ.
7. ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్, అహ్మదాబాద్.
8. పంజాబ్ విశ్వవిద్యాలయం.
9. కె.యం.పణిక్కర్.
10. వనస్థలి విద్యాపీఠ్.
11. కలకత్తా.
12. నార్త్ ఈస్టర్న్ హిల్ యూనివర్సిటీ.



# విఘ్నేశ్వరుడు

గంగా పార్వతుల మధ్య కొంతకాలం క్రమ క్రమంగా ద్వేషం వర్థిల్లుతుండగా, గంగా పుష్కరం వచ్చింది.

ఆ సమయంలో నారదుడు పార్వతి దగ్గరికి వెళ్ళి, ''ముక్కోటి దేవతలు వారివారి మహత్తులు, శక్తులు గంగాజలానికి సంక్ర మించేలాగ పుష్కర స్నానాలు చేస్తున్నారు. అమ్మా గౌరీ! నీవు కూడా అలాగ చేస్తే, విశాల హృదయం గల మంచిదానివి నీవేనని, లోకం నిన్నే మెచ్చుకుంటుంది!'' అని చెప్పి అలాగే వెళ్ళి, గంగతో, ''గంగాభవానీ! నిన్ను పావనం చేద్దామని పార్వతి విజయం చేస్తున్నది, తెలుసా!'' అన్నాడు.

''అలాగా! దయాదాక్షిణ్యాలు, చాటు కుందామని వస్తున్నదా, రానీ చెపుతాను,'' అన్నది గంగ.

పార్వతి పూలు జల్లి గంగలో దిగబోతూంటే, ''ఆగు! నన్ను మలినపరచకు!'' అని గంగ ఆటంకపరిచింది. ఇద్దరికీ గొప్ప వివాద సంవాదం జరిగింది.

''కుమారస్వామిని శరవణ సరస్సు కన్నది; నీ అవిటి చేతుల్లో నలిగిన బొమ్మ బాబు, పాపం, గజముఖుడయ్యాడు; నీవు మాత్రం సంతానభాగ్యం లేని ఒఠ్ఠిగొడ్రాలివి!'' అన్నది గంగ.

''నేనెవర్నో తెలుసా, పరమశివుడి అర్ధాంగిని, భాగేశ్వరిని!'' అన్నది పార్వతి.

''తెలియకేం, బాగా తెలుసు. కట్టుకున్న అమాయకుణ్ణి సగం తినేసిన పరమపాత కివి?'' అన్నది గంగ.

''జారిపడిన భ్రష్టురాలివి నువ్వు!'' అన్నది పార్వతి.



"హాలాహలం గొంతు దిగకుండా మ్రింగిన తాపాన్ని చల్లార్చితే మెచ్చి, నచ్చి, మనోహర కుసుమకుమారిగా తలను దాల్చిన జగద్రక్షకుడికి ఇష్టురాలినో, భ్రష్టురాలినో లోకానికి తెలుసు!" అంది గంగ.

"ఎవరో పిలిస్తే వస్తూ చిక్కులుపడిన అర్భకురాలివి. వల్లమాలిన సుకుమారితనం దేనికి?" అన్నది పార్వతి.

"నువ్వలాగే అంటావులే! బలులు కోరే జాలిలేని అమ్మతల్లివి! వామాచారిణివి, మలినపు, అంటరాని మాతంగివి, కఠినాత్మురాలివి, మోటుదానివి, శక్తివి!" అని గంగ గడగడా అనేసింది.

"బాగా గుర్తుచేశావు గంగా! ఔను, నేను శక్తిని, మహాశక్తిని!" అంటూ పార్వతి ఆవేశం పొందింది. మరుక్షణమే ప్రళయ ప్రభంజనాలు వీచాయి. చీకట్లు కమ్మాయి. మెరుపులతో ఆకాశం గర్జించింది. పిడుగులు పడ్డాయి. భూమి కంపించింది. మంచు శిఖరాలు కరిగాయి.

పార్వతి ఆవేశానికి గంగ పరిహాసం చేస్తూ "చాల్లే! చల్లనిదాన్నికదా అని నన్ను చిన్నచూపు చూశావేకాని, నేను జలశక్తిని అన్న సంగతి మరిచావు; నన్ను రెచ్చగొట్టిన పాపం నీదే!" అంటూ గంగ హిమాలయ శిఖరాగ్రాల ఎత్తున పొంగింది. గంగానది పరవళ్ళు తొక్కుతూ ఉత్తర భూమిని జలమయం చేసింది.

దేవతలు బారులు తీర్చి ఆకాశం మీది నుంచి జరిగిన బీభత్సాన్ని చూస్తూ, "అమ్మలు ఒకరినొకరు ఆడిపోసుకోవడం కాదుగాని ప్రళయం తెచ్చిపెట్టారు!" అని నిట్టూర్చి, కలహబీజం నాటిన నారదుణ్ణి ఒక్కుమ్మడిగా నిందించారు.

విఘ్నేశ్వరుడు దక్షిణం నుంచి తిరిగివస్తూ, నారదుణ్ణి చూసి, "కలహభోజనా, ఇప్పుడు కడుపునిండిందా? హఠాత్తుగా జగత్తుకు ఎంత ఉపద్రవం తెచ్చిపెట్టావయ్యా!" అన్నాడు.

నారదుడు, "ఇలాంటి ఉపద్రవాలు వచ్చినప్పుడే కదా కడుపునిండిన వినాయకులెవరో, లోకకళ్యాణం కోసం నడుము బిగించి పాటుపడే నాయకుడెవరో తెలిసేది!" అని ఛలోక్తి విసురుతూ వెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు కైలాసం చేరాడు.

కైలాసంలో పార్వతి పశ్చాత్తాపంతో తనలో తాను, "మళ్ళీ మరొక భగీరథుడు తరలించుకుపోతేనేగాని గంగ ఉద్ధృతం తగ్గదు!" అని గట్టిగా అనుకున్నది.

ఆ మాటలు విఘ్నేశ్వరుడు విన్నాడు. ఏమీ ఎరగనట్టు పార్వతి ముంగిటకు వచ్చి

మెల్లగా వంగి పాదాభివందనం చేసి, "అమ్మా ఒక మంచిపని తలపెట్టాను, ఆశీర్వదించమ్మా!" అన్నాడు.

"విఘ్నేశ్వరుడు తలపెట్టితే అడ్డేమిటి, నాయనా! ఇంతకూ నువ్వేదో దక్షిణంగా వెళ్ళివచ్చినట్టున్నావు, విశేషమేమిటి?" అన్నది పార్వతి.

విఘ్నేశ్వరుడు, "ఏం చెప్పమంటావు? వింధ్యకు దిగువ అంతా శూన్యంగా ఉన్నది. ఆ ప్రదేశం అంతా పైరు పచ్చగా, నీ అన్నపూర్ణ నామధేయాన్ని పొందితే ఎంత బాగుంటుంది! అనిపించిందమ్మా, గంగమ్మ కాస్త అటు వెళ్ళి చల్లగా చూస్తే కాదా, ఏమంటావమ్మా?" అన్నాడు.

పార్వతి, "నేననేదేముందబ్బా, అంతా ఆ విశ్వనాథుడిదే కదా భారం!" అన్నది చాలా నిర్లిప్తంగా.

విఘ్నేశ్వరుడు, "అలా అని మనం ఊరికే చూస్తుండవలసిందేనా? ప్రపంచానికి ఒక మంచి పని జరగాలంటే మన ప్రయత్నం ఉండాలా వద్దా?" అన్నాడు.

"తప్పకుండా ఉండాలి. అందునా నీలాంటి వాడు పూనుకుంటే జరగనిదేముంది!" అంది పార్వతి.

"ఆ మాట చాలునమ్మా వెళ్ళి వస్తాను," అని పార్వతి పాదాలు తొండంతో కళ్ళకద్దు కొని అక్కడి నుంచి బయలుదేరిన విఘ్నేశ్వరుడు, తిన్నగా గౌతమమహర్షి ఆశ్రమ ప్రాంతానికి చేరుకున్నాడు.

గౌతముడు పడమటికనుమల నడుమ చిన్న ఆశ్రమం ఏర్పరచుకొని, అవసరం మట్టుకు సేద్యం చేసుకుంటూ ఉన్నాడు.



విఘ్నేశ్వరుడు నిండుచూలుతో ఉన్న ఆవుగా మారాడు.

పెరిగిన చేను తొక్కుకుంటూ మేస్తున్న ఆవును అదలించి తరిమే ప్రయత్నంగా గౌతముడు కమండలం నీరు అరచేత్తో విసిరాడు. ఆ నీటిచుక్కలు పడీపడ్డంతో ఆవు పడిపోయి గిలగిల తన్నుకొని కొయ్యబారింది. గౌతముడు తన సుకృతాన్నీ, తపస్సునూ ధారబోసినా మాయదారి గొడ్డు మూసిన కన్ను తెరవలేదు.

నారదుడు దేవేంద్రుణ్ణి ఉసిగొలిపాడు. ఇంద్రుడికి గౌతముడి మీద తీరని పగ ఉంది. బ్రహ్మ అపూర్వసుందరిగా అహల్యను సృష్టి చేశాడు. ఇంద్రుడు చాలా ఆశపడ్డాడు. ఇంకా చాలామంది పోటీపడ్డారు. భూదేవిని ప్రదక్షిణంచేసి ఎవరు ముందువస్తే, అహల్య అతనిదవుతుందని బ్రహ్మ పందెం పెట్టాడు. గౌతముడు ప్రసవిస్తున్న ఆవు చుట్టూరా తిరిగి



వచ్చి, బ్రహ్మతో వాదించి ఒప్పించి అహల్యను భార్యగా గెల్చుకున్నాడు.

గోవు సాక్షాత్తూ భూదేవితో సమానమని చెప్పిన ఆ గౌతముడి చేతి మీదుగా గోహత్య జరిగింది! పగ తీర్చుకోడానికి మంచి అవకాశం వచ్చిందని ఇంద్రుడు గొప్ప మునిపుంగవుడి వేషంతో తిరిగి తిరిగి, ''గౌతముడు గోహత్య చేసిన మహాపాపి! అతని ఆశ్రమం మైలపడి పోయింది. గౌతముడిని చూసినా, ఆశ్రమంలో అడుగుపెట్టినా మహాపాతకం చుట్టుకుంటుంది! దీనికి పవిత్ర గంగాజలాలు ఆశ్రమ సీమలో ఆవు మీద నుంచి ప్రవహించాలే తప్ప వేరే పరిహారం ఏదీ లేదు!'' అని లోకమంతా చాటి, సాటి మహర్షులను బాగా రెచ్చగొట్టాడు.

ఋషులు గౌతముణ్ణి వెలివేశారు. ఆశ్రమవాసులంతా ఆగ్రహంతో అక్కడినుంచి వెళ్ళిపోయారు.

ఎక్కడి గంగానది! ఎక్కడి పడమటి కనుమలు! అయినప్పటికీ గౌతముడు భగీరథుణ్ణి ఆదర్శంగా పెట్టుకొని తలపెట్టిన కార్యం, సాధించి తీరాలన్న పట్టుదలతో గంగాదేవిని గూర్చి హిమాలయాల్లో గొప్ప తపస్సు చేశాడు.

కపిలమహాముని కోపాగ్నికి బూడిద పోగులైన తన తాతలను తరింపజేయడానికి భగీరథుడు జలాధి దేవతయైన గంగాదేవిని తపస్సు చేసి మెప్పించి దివినుండి భువికి దింపాడు. శివుడు తన జటాజూటంలో గంగను ధరించాడు, గంగ గంగాభవాని అనిపించుకుంది. గంగను ఒదలమని భగీరథుడు శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు జడల ముడి సడలించి గంగను కొద్దిగా ఒదిలాడు. గొప్ప వేగంతో గంగ చిమ్ముకొచ్చి నలుదెసలా హిమాలయాల్లో పడింది. భగీరథుడి వెంట గంగ ప్రవాహంగా తూర్పు ముఖంగా వెళ్లింది. గంగకు భాగీరథి అని పేరు వచ్చింది.

హిమాలయాల్లో పడిన గంగ కొంత హిందు కుశ శిఖరాల మీదుగా పడమరకు ఇందు నదిగా ప్రవహించింది. ఇందు నదినే సింధునది అన్నారు. భరతఖండానికి వాయువ్యంగా ఉన్న సింధునది మూలంగా హిందూదేశమనే పేరు వచ్చింది.

భగీరథుడి వెంట మహావేగంగా వెళుతూన్న గంగను తన ఆశ్రమం పాడవకుండా జహ్నుమహాముని తాగేశాడు. భగీరథుడు జహ్నుమునిని ప్రార్థించి గంగను విడుదల చేయించాడు. జహ్నుమహాముని చెవినుండి గంగ వెలికి వచ్చినందువల్ల గంగకు జాహ్నవి అనే పేరుకూడా వచ్చింది. తరవాత గంగాజలం కపిలాశ్రమం

చేరి, భగీరథుడి పితరుల మీదుగా ప్రవహించి తరింపజేసి భగీరథుడి ప్రయత్నాన్ని ఫలింప జేసింది.

భగీరథుడు కూడా అంత గొప్ప తపస్సు చేయలేదని గౌతముణ్ణి మెచ్చుకొని గంగ ప్రసన్నురాలై అదేవిధంగా గౌతముడి వెంట బయలుదేరింది. దారి పొడవునా గంగాదేవి అడుగుజాడల్లో ఎన్నో యేర్లు, వాగులు పుట్టాయి.

గౌతమాశ్రమం చేరుతూనే గంగ నదీ ప్రవాహమై గౌతముడు దారి చూపుతూ ముందు నడుస్తూంటే, ఆవు మీది నుంచి జలజలా పారి గలగలా ప్రవహించి గౌతమి అని పేరు పొందింది.

మాయదారి ఆవు దిగ్గున లేచి నాలుగడు గులు ముందుకు వేసి, చుట్టుపక్కల కలయచూసి అలా పైకెగసి ఆకాశంలో అదృశ్యం కాగా విఘ్నేశ్వరుడు సాక్షాత్క రించాడు.

విఘ్నేశ్వరుడు గంగకు నమస్కరించి, ''అమ్మా! తనయుణ్ణి మన్నించు. నీ దయా మృత జలాలతో వింధ్యకు దిగువనున్న భూభాగమంతా సుభిక్షం కావాలని ఇంతపని చేశాను. దక్షిణ గంగగా అవతరించిన నీవు, గోవును బ్రతికించి ఇచ్చినందువల్ల గోదావరి అని పేరు పొందుతావు!'' అని చేతులెత్తి మొక్కి అదృశ్యమయ్యాడు.

గోదావరి అనేక ఉపనదులతో తూర్పుగా పయనించి తూర్పు మైదానాల్ని సస్యశ్యా మలం చేసింది.

సప్తఋషులు, దేవతలు పరమానందంతో గోదావరిలో జలకమాడారు. గౌతముణ్ణి ఎన్నో



విధాల శ్లాఘించి అపర భగీరథుడు అన్నారు. గోదావరి సప్తగోదావరిగా చీలి తూర్పు సము ద్రాన్ని చేరింది.

గంగ గోదావరి ప్రవాహంగా మారుతున్న ప్పుడు, ఆమె నల్లని వేణీభరము విరజిమ్ము కొని పడమటికనుమల్లో చిక్కుపడింది. మహావిష్ణువు తన చేతి వ్రేళ్ళతో సుతారంగా ఆ చిక్కు విడదీశాడు. కృష్ణవర్ణుడైన విష్ణువు వ్రేళ్ళ సందులనుంచి కొప్పులో నీరు జారుతూ కృష్ణవేణి, కృష్ణానది అని పిలువబడుతూ మరొక గొప్పనది ప్రవహించింది.

అలాగే గంగాజలం ఆకాశంలో ఎగిరి, దక్షిణంగా ఉన్న కవేరమహాముని ఆశ్రమంలో కమండలంలో పడి, కన్యగా పెరిగి, అగస్త్యుని వెంట అరణ్యాల్లో విహరిస్తూ, కావేరినదిగా మారి, అందమైన జలపాతాలతో దక్షిణసీమలో ప్రవహించింది.

ఆ విధంగా గౌతమమహర్షి తెచ్చిన గంగ మరొకమూడు గొప్ప నదులుగా దక్షిణ భారత భూమిని సుభిక్షం చేసింది.

దేశంలో గంగ, గోదావరి, కృష్ణ, కావేరి అని నాలుగు నదుల పేర్లు చెప్పుకోవడం పరిపాటి అయింది.

గౌతమముని ఆశ్రమం తిరిగి కళకళ లాడింది. ఆశ్రమాన్ని వదిలిన మునులందరూ మళ్ళీ వచ్చి చేరారు.

గోదావరి పొడవునా అనేక క్షేత్రాలు వెలిశాయి.

గౌతముడి కీర్తి కూడా వ్యాపించింది. గంగ పడమటికనుమలకు ప్రవహించడం అనేది అసంభవమైనది గనుకనే ఇంద్రుడు ఆ విధంగా పరిహారం చెప్పాడేగాని, అసంభవాన్ని సాధించి సంభవంగా మార్చిన గౌతముడి గొప్ప దనాన్ని గుర్తించి ఆయన వద్దకు వెళ్ళి క్షమా పణ వేడుకున్నాడు.

గౌతముడికి మాత్రం సంతోషం లేకపో యింది. అదివరకే ఇంద్రుడిమోసం కారణంగా అహల్యను బండరాయిగా పడి ఉండమని శపించి, ఉత్తరదేశం నుంచి వింధ్య దాటి పడమటి చరియలో ఆశ్రమం కట్టుకుని ఒంటరిగా ప్రశాంతంగా తపస్సు చేసుకొంటు న్నాడు. గోదావరి అవతరణంతో పడమటి కనుమల్లోని మునుల ఆశ్రమాలు మరింత శోభించాయి. అత్రిమహాముని త్రిమూర్తుల అంశలతో పుత్రవంతుడయ్యాడు. ఆయన పత్ని అనసూయ అతిథులకు నిరతాన్నదానం చేస్తున్నది.

గౌతముడి ఆశ్రమం చుట్టూరా కూడా సస్యసమృద్ధి విశేషంగా ఉన్నా అహల్యలేని కొరత కనిపిస్తూనే ఉన్నది. తొందరపడి అహల్యను శపించినందుకు గౌతముడు మనస్సులో విచారిస్తున్న సమయంలో విఘ్నే శ్వరుడు కనిపించి, "గౌతమా! విచారించకు. త్వరలోనే విష్ణువు అవతరించి రాముడై తన పాదం మోపి, నీ భార్యను మనిషిగా చేస్తాడు. పాషాణి పునీత అవుతుంది! గోదావరి అవతర ణానికిగాను, నీకు చాలా శ్రమ ఇచ్చాను. గోదావరికి గౌతమి నామం చిరస్థాయిగా ఉంటుంది!" అన్నాడు.

గౌతముడు ఆ మాటలకు సంతోషంతో, "విఘ్నేశ్వరా! అంతా నీ సంకల్పబలం వల్లనే కదా జరిగింది! గోదావరి జలాలూ, విఘ్నేశ్వ రుని కృపాఎల్లకాలమూ రక్షిస్తూ ఉంటాయి!" అన్నాడు.





# భవానీ అనుగ్రహం

భవానీపురంలో బుక్కుడు అనే దొంగ వుండే వాడు. అయితే వాడు అన్నివేళలా దొంగత నానికి వెళ్ళేవాడుకాదు. పొలాల్లో నాట్లువేసే సమయంలోనూ, పంట కోతకు వచ్చే సమ యంలోనూ, కూలిపని దొరికినన్నాళ్ళూ కూలికి వెళ్ళేవాడు. వాడికి భార్య, యుక్తవయస్సు వచ్చిన కొడుకూ వున్నారు. భార్యకు బుక్కుడు దొంగతనాలు చేస్తాడని తెలుసు; కాని కొడుక్కు తెలియదు.

బుక్కుడు దొంగతనానికి వెళ్ళేటప్పుడు, భవానీపురం గుడిలో భవానీదేవతను దర్శించి, ''తల్లీ! నేను తప్పనిసరి పరిస్థితుల్లో దొంగ తనాలు చేస్తున్నాను. ఆ సంగతి నీకు తెలి యందికాదు. నువ్వు అందరి దగ్గర ముడు పులు తీసుకుని కోరికలు తీరుస్తున్నట్లే, నా ముడుపు కూడా తీసుకో. నాది, భార్యది, కొడుకుతోపాటు నిన్ను కూడా నా కుటుంబంలో ఒకరుగా భావించి, నాలుగో వాటా ఇస్తాను. ఏ అపాయంలో చిక్కుకోకుండా భద్రంగా ఇంటికి చేర్చు,'' అనేవాడు.

ఆ విధంగా దొంగతనం చేసి తెచ్చిన డబ్బులోనూ, కూలిపనులు చేసినప్పుడు వచ్చిన డబ్బులోనూ వాడు మిగుల్చుకున్న దేమీ లేదు. జీవితం సుఖంగా వుండడంచేత, వాడిలో పాపభీతి ఏనాడూ కలగలేదు.

ఒకసారి బుక్కుడు దొంగతనం కోసం నగరానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఒక నాటక ప్రదర్శనశాలలో వాల్మీకిమహర్షి నాటకం ప్రదర్శించబడుతున్నది. వాల్మీకి మహర్షి మొదటి పేరు బుక్కుడు. తన పేరు కూడా బుక్కుడు కావడంతోను, బుక్కుడు మునిగా మారనప్పుడు దొంగతనాలు చేస్తూండడంతో, బుక్కుడిలో కుతూహలం కలిగింది. అందు చేత వాడు నాటకం మొదటినుంచి చివరి వరకూ చూశాడు. దొంగైన బుక్కుడు వాల్మీకి ఋషిగా మారడం, రామాయణం రాయడం

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



వాడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. దొంగ తనాలు మానేస్తే తను కూడా అంత గొప్పవాడు కావచ్చన్న ఆశ కలిగింది వాడికి.

''అమ్మా భవానీ! ఇక ఆఖరిసారిగా దొంగ తనం చేసి, పండితులవద్ద చదువుకుని గొప్ప పుస్తకం రాస్తాను. ఈసారి పెద్దమొత్తం దొరికేట్టు అనుగ్రహించు!''అని బుక్కుడు మనసులో భవానీదేవిని ప్రార్థించి, అక్కడినుంచి బయలు దేరి, ఒక ఇంట్లో దొంగతనం చేయబోతూ రాజ భటులకు దొరికిపోయాడు. వాళ్ళు వాణ్ణి దండనాధికారి దగ్గరకు తీసుకుపోయారు. ఆయన వాణ్ణి చెరసాలలో వేయించాడు.

బుక్కుడు ఎన్నాళ్ళకూ తిరిగి రాకపోయే సరికి వాడి భార్య బెంగపడి, ఒకనాటి సూర్యా స్తమయంవేళ కొడుకు నారాయణను వెంట బెట్టుకుని భవానీగుడికి వెళ్ళి, ''అమ్మా, నా భర్త దొంగైనా నీకు భక్తుడు. మేడలు, మిద్దెలు కట్టాలని దొంగతనాలు చెయ్యలేదు. పేదరి కమే కారణం. నా భర్తను క్షేమంగా ఇంటికి చేర్చు, తల్లీ!'' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

నారాయణ, తల్లి మాటలు ఆశ్చర్యంగా విని, తండ్రి దొంగతనాలుచేసేవాడన్న నిజాన్ని భరించలేకపోయాడు. వాడు తల్లితోపాటు ఇంటికి తిరిగివెళ్ళక, గుడి మంటపంలోని ఒక స్తంభానికి ఆనుకుని కూర్చుని, తండ్రి గురించి ఆవేదన పడసాగాడు.

క్రమంగా చీకటిపడి అర్ధరాత్రి అయింది. ఈ కష్టసమయంలో, తన భక్తుడైన నా తండ్రిని, భవానీమాతే రక్షిస్తుంది, అనుకుంటూ నారా యణ సొమ్మసిల్లి కళ్ళు మూసుకున్నాడు. ఆ స్థితిలో వాడికొక కలవచ్చింది. కలలో భవానీమాత ఒక నిండు ముత్తయిదువులా కనిపించి, ''నారాయణా! తన భక్తుడైన తండ్రిని భవానీమాత కాపాడలేదని, ఏమైనా దూషించ డానికి వచ్చావా?'' అని అడిగింది నవ్వుతూ.

ఆ ప్రశ్నకు నారాయణ నిలువెల్లా వణికి పోతూ, ''లేదు తల్లీ లేదు! కరుణించమని అడిగేందుకు వచ్చాను,'' అంటూ చెంపలు వేసుకున్నాడు.

ఈసారి కొంచెం గంభీరంగా ముత్తయి దువు, ''ఈ రూపంలో వున్న నన్ను గుర్తించిన నీ భక్తిని మెచ్చుకుంటున్నాను. నీ తండ్రి వాల్మీకిలా మారాలనుకున్నాడుగాని, రాగద్వే షాలు వదలలేదు. కుటుంబాన్ని పోషించే బాధ్యత వున్నంతవరకూ, అతడి దొంగతనాన్ని క్షమించడం జరిగింది. కాని, వాల్మీకిలా గొప్ప వాడవడం కోసం దొంగతనం చేయబోయి దొరికిపోయాడు,'' అన్నది.

''అయితే, తల్లీ! నేనిప్పుడు కన్న తల్లిని పోషించుకోవాలి. సంవత్సరం పొడుగునా కూలి పనులు దొరకవు. ఏదైనా వ్యాపారం చేసి బతగ్గ లను; కాని డబ్బులేదు!'' అంటూ నారాయణ మరి గొంతుపెగలక, దీనంగా వుండిపోయాడు.

ముత్తయిదువు మాయమయింది. తెల్ల వారుతూండగా, గుడి ముందు వీధిలో వచ్చే పోయే బళ్ళూ, మనుషుల రద్దీతో నారాయ ణకు మెలుకువ వచ్చింది. వాడు కళ్ళు తెరు స్తూనే, ''ఎంత అదృష్టవంతుణ్ణి! ప్రత్యక్షంగా కాకపోయినా కలలో అయినా భవాని అమ్మ వారిని చూడగలిగాను,'' అనుకుంటూ లేవబో యేంతలో, పక్కనే ఒక చిన్నమూట కనబడింది. వాడు దాన్ని ఆతృతగా విప్పిచూశాడు. లోపల వెండీ, బంగారు కాసులు! వాడి కళ్ళు మెరి శాయి. చప్పున ఒక ఆలోచనకూడా వచ్చింది.

''ఈ సొమ్ము నేను హుండీలోంచి దొంగి లించలేదు. స్వయంగా అమ్మవారిచ్చింది,'' అనుకుంటూ నారాయణ అప్పటికప్పుడు బయలుదేరి, దాపులనున్న రాజధాని చేరాడు. అక్కడ నానాతంటాలూ పడి రాజదర్శనం చేసుకుని, దండనాధికారి, తన తండ్రిబుక్కణ్ణి చెరసాలలో వేయించిన సంగతీ, తనకు కలలో భవానీదేవి కనిపించి సొమ్ము ఇచ్చిన సంగతీ వివరించాడు.

ఇది విన్న రాజు అద్భుతం చెంది, ''ఒరే, నారాయణా! నువ్వు నిజాయితీపరుడివి. అలా కాకపోతే అమ్మవారనుగ్రహించిన సొమ్ముతో ఎక్కడికైనా పారిపోయేవాడివి. నీ తండ్రి దొంగ తనాలు మాని వాల్మీకి అంతవాడయిపోవా లనుకోవడంలో తప్పులేదు. కాని, అందు కోసం అతడు అనుసరించిన మార్గం చాలా దుష్టమైనది. అందుకే అమ్మవారు శిక్షిస్తూనే అనుగ్రహం కూడా చూపింది,'' అని, భటు లను పంపి బుక్కణ్ణి చెరసాల నుంచి విడు దలచేయించి, తండ్రీ కొడుకులు సుఖంగా బతికేందుకు తగిన ఏర్పాటు చేయించాడు.

ఈ అనుభవంతో, రాజు ఆనాటినుంచీ మంచి పరివర్తన తీసుకురావడానికి నేరస్థు లను తప్పని పరిస్థితుల్లో శిక్షించినా, వారి కుటుంబాలు దురవస్థలపాలు కాకుండా ఆదుకుని, ప్రజారంజకుడనిపించుకున్నాడు.



# వినోద సమయం

## రంగుల తమాషా!

పక్కన ఒక అందమైన దృశ్యం ఉంది. దానికి తగిన రంగులు వేశారంటే మరింత అందం వస్తుంది. మీకు ఉపయోగంగా ఉంటుం దని ఎక్కడెక్కడ ఏ ఏ రంగులు వాడాలో కూడా సూచించాం. రంగులు అందుకోండి మరి!







## ఒకే గీతలో...

ఇది చాలా అందమైన తేనెటీగ కదూ! చాలా విలక్షణమైనది కూడా! ఇది ఒకే గీతతో చిత్రించబడింది. పెన్సిల్ తీసుకుని మీరూ ప్రయత్నించి చూడండి!

# తేడాలు కనుగొనండి!

చూడడానికి రెండు చిత్రాలూ ఒకేవిధంగా ఉన్నాయి. అయితే రెండింటికీ మధ్య ఎనిమిది తేడాలు ఉన్నాయి. సరదాగా కనుగొనండి చూద్దాం!





# పొంచి ఉన్న అపాయం!



చెట్టుకింద హాయిగా కాలుమీద కాలు వేసుకుని కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నది కోతిపిల్ల. దానిచుట్టూ పొంచి ఉన్న జంతువుల అపాయం గురించి ఆ పిల్ల కోతికి తెలియదు పాపం. ఏ ఏ జంతువులు పొంచి ఉన్నాయో మీరు గుర్తించగలరా?

(సమాధానాలు 66 వ పేజీలో)



# మంచిమనసుకు మంచిరోజులు

రత్నగిరి జమీందారు తోటమాలి హఠాత్తుగా పాము కరిచి చనిపోయాడు. అతడికి భార్య, ఇద్దరుకొడుకులున్నారు. వారిని పరామర్శించ బోయిన జమీందారు, తోటమాలి భార్యతో, ''ఇప్పుడు మీకు బతుకుతెరువు చూపించా ల్సిన బాధ్యత నాకుంది. ఎదిగివచ్చిన మీ పెద్దబ్బాయికి నా కొలువులో ఏదైనా ఉద్యోగం ఇస్తాను,'' అన్నాడు.

అందుకు తోటమాలి భార్య, ''అయ్యా, పెద్దవాడు తెలివిగలవాడు, కలుపుగోలు మనిషి. అందరితోనూ మంచిగా ఉంటాడు. ఎటువంటి కష్టమైనా భరించి అనుకున్నది సాధించగలడు. ఎలా అయినా బతగ్గలడు. దయవుంచి, చిన్నవాడికి ఉద్యోగం ఇవ్వండి, మీ నీడలో వాడిమానాన వాడు బతికిపోతాడు,'' అన్నది.

ఇందుకు జమీందారు, పెద్దవాడి అంగీ కారం అడిగాడు. పెద్దవాడు ఎంతో సంతోషంగా అంగీకరించాడు. ఒక వారం తిరిగేలోగా చిన్నవాడు జమీందారు కొలువులో చేరి పోయాడు. వాడికి జీవితం సుఖంగా సాగి పోతున్నది.

ఈ లోపల పెద్దవాడు, తండ్రిసంపాయించి వదిలిపోయిన అంతగా వ్యవసాయయోగ్యం కాని రెండెకరాల బీడుపొలాన్ని, రాత్రిం బవళ్ళు శరీరకష్టంతో తీర్చిదిద్దాడు. అక్కడా ఇక్కడా అప్పుతెచ్చి పెట్టుబడి పెట్టి మామిడి మొక్కలు నాటాడు. తోటను కంటికి రెప్పలా కాపాడాడు.

నాలుగయిదేళ్ళు గడిచేసరికి తోట కాపు కొచ్చింది. క్రమేణా పెద్దవాడికి ఆదాయం చేతి కందసాగింది. ఇలా రెండు మూడేళ్ళు గడిచే

డా. గంగిశెట్టి శివకుమార్

సరికి, పెద్దవాడు గ్రామంలో కాస్త ఆర్థికంగా స్థిరపడ్డాడు.

ఈ విషయం ఆనోటా, ఈనోటా రత్నగిరిలో వున్న చిన్నవాడికి చేరింది. అన్న బాగుపడటం వాడికిష్టం లేకపోయింది. త్యాగబుద్ధి చూపి, తనకు బతుకుతెరువు చూపాడన్న కృతజ్ఞత కూడా లేకపోయింది.

ఉన్నపళాన వాడు పల్లెకు వూడిపడ్డాడు. వాడు తల్లితో, ''ఇదేమన్నా న్యాయంగా వుందా? నాన్న సంపాదనలో అన్నదమ్ములైన మా ఇద్దరికీ సమానహక్కు వున్నది కదా! అన్న ఒక్కడే అనుభవిస్తూంటే చూస్తూ వూరుకున్నావేం?'' అన్నాడు.

న్యాయం చెప్తే చిన్నవాడికి మరింతగా కోపం వస్తుందని, ఆమె నోరు మెదపలేదు.

ఇది పనికాదని చిన్నవాడు మహామూర్ఖంగా గ్రామంలోకి పోయి, తన దూరపుబంధువు శరభయ్య అనేవాడితో, తనకు అన్యాయం జరిగిందంటూ మొరబెట్టుకున్నాడు. ఇలాంటి తగాదాలంటే శరభయ్యకు మహావినోదం. గ్రామంలో ఏ తగాదావచ్చినా దాన్ని పెంచటమే గాక, దాన్ని చివరకు తనకు లాభంగా మార్చుకో గలగటంలో దిట్ట.

శరభయ్య, చిన్నవాణ్ణి బుజ్జగిస్తూ, ''ఒరే, చిన్నా! ఇదిఅంతతేలికగా తేలేవిషయం కాదు. గ్రామపెద్ద వద్దకు పోవాల్సిందే,'' అన్నాడు.

గ్రామపెద్ద శరభయ్యకు మంచి మిత్రుడు, పైగా పెద్ద లంచగొండి. అందువల్ల శరభయ్య, చిన్నవాడికి అనుకూలంగా తీర్పువచ్చేటట్లు చూడగలిగాడు.

తన భాగానికి వచ్చిన ఎకరా మామిడి తోటను, ఏం చేయాలా అని చిన్నవాడు ఆలోచిస్తూంటే శరభయ్య, ''తోట సంగతి నేను చూస్తాలే. ఆ విచారం నీకు వద్దు. ఏడాది చివర వచ్చిన ఆదాయాన్ని చెరిసగం తీసుకుందాం,'' అన్నాడు.



చిన్నవాడు సంతోషంగా తోట బాధ్యతను శరభయ్యకు అప్పగించి, మరునాడే తిరిగి రత్నగిరి చేరాడు.

శరభయ్య, గ్రామపెద్దలవల్ల జరుగుతున్న కుట్ర అంతా గమనిస్తున్న చిన్నవాడి తల్లి, ఇక సహించలేక పెద్దకొడుకును వెంటబెట్టుకుని రత్నగిరి వెళ్ళి, శరభయ్యను గురించీ, గ్రామ పెద్దను గురించీ జమీందారుకు ఫిర్యాదు చేసింది.

జమీందారు, శరభయ్యను, గ్రామపెద్దను తన కొలువుకు రప్పించి-నయానా, భయానా వాళ్ళనుంచి మొత్తం విషయం రాబట్టాడు. జరిగినదంతా విన్న జమీందారుకు, చిన్నవాడి మీద ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. ఆయన చిన్నవాడితో, ''ఓరి, కృతఘ్నుడా! మేలు చేసినవాడికి కీడు చేసే నువ్వు ఎలా సుఖంగా బతగ్గలవు? దొంగిలించిన సొత్తు అనుభవానికి రాదు, అని పెద్దలంటారు. అది నీకూ జరిగి తీరుతుంది. కృతజ్ఞత లేనివాడు హంతకుడి కంటే, దొంగ కంటే నీచుడని ఆర్యోక్తి. నీలాంటి వాడు నా కొలువులో వుండ టంనాకు సిగ్గుచేటు. అందువల్ల, నిన్ను నా కొలువులోంచి తొలగిస్తున్నాను. పోయి, తండ్రి ఆస్తిలో వచ్చిన నీ వాటా ఎకరం మామిడితోట తోనే బతుకు,'' అని ఆజ్ఞాపించాడు.

తర్వాత జమీందారు, గ్రామంలో తప్పుడు వ్యవహారాలు నడుపుతున్నందుకు గ్రామ పెద్దను, శరభయ్యను గట్టిగా చివాట్లుపెట్టి, వాళ్ళకు పెద్దమొత్తాన్ని జరిమానాగా విధించాడు. జమీందారు అంతటితో వూరుకోక, పెద్దవాడితో, ''మిగిలిన ఎకరం తోట నీ కష్టార్జితం! అంతేకాదు, నీలోని స్వార్థరహితమైన ఉపకారబుద్ధిని ప్రశంసిస్తూ, ఈనాటినుంచీ నిన్ను గ్రామ పెద్దగా నియమిస్తున్నాను!'' అని, అప్పటికప్పుడు దివానుచేత అందుకుసరమైన పత్రాలు రాయించి, పెద్దవాడికి ఇప్పించాడు.

ఈ విధంగా మంచి మనసుగల అన్నకు మంచిరోజులు ప్రాప్తించాయి.





# మనవి

చందమామ జన్మదినోత్సవ సందర్భంగా జూలై సంచిక నుంచి పిల్లల సృజనాత్మక శక్తికి పనికల్పించే ఉద్దేశంతో "మీరే చేసుకోవచ్చు" అనే కొత్త శీర్షికను ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టాం. వ్యయప్రయాసలకోర్చి ఆగస్ట్, సెప్టెంబర్ నెలలలోనూ కొనసాగించాం. అయితే, ఈ సదవకాశాన్ని ఎంతమంది యువపాఠకులు సక్రమంగా వినియోగించుకుంటున్నారో స్పష్టంగా తెలియకపోవడం వల్ల ఈ నెల దానిని ప్రచురించడం లేదు. ఈ విషయంలో పాఠకుల స్పందన అవసరమవుతున్నది. దీనిని గురించే కాకుండా ఇతర శీర్షికలు, కథల గురించి కూడా పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాము. పాఠకులు తమ అభిప్రాయాలను ఎప్పటికప్పుడు తెలియజేస్తే పత్రికను వారి అభీష్టానికి అనుగుణంగా మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దడానికి అవకాశం ఉంటుంది.

– సం.




అరుణ ఆదిత్యుణ్ణి అతని నివాసభవనంలో కలుసుకున్నది.







అరుణ అక్కడినుంచి వెళ్ళిన తరవాత, ఆదిత్యుడు పూజా మందిరంలోకి వెళ్ళి గరుడవిగ్రహం ముందు కూర్చుని ధ్యాన నిమగ్నుడయ్యాడు.




హఠాత్తుగా బుస్సుమనే శబ్దం వినిపించడంతో ఆదిత్యుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా స్త్రీ తలా, అర్ధశరీరమూ గల ఒక పెద్దసర్పం కనిపించింది.



ఆదిత్యుడు నిశ్చలంగా మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. తాంత్రికుడు కొన్ని క్రతువులు చేయడం ఆయన మనో ఫలకం మీద కదలాడింది.





అతని ఎదుట ఉన్న గరుడుడి ఈక, పెద్ద డేగ రూపమెత్తి, సర్పం మీదికివెళ్ళింది. పాషాంకర తప్పించుకుని పారిపోవ డానికి ప్రయత్నించింది.



అయితే, డేగగట్టిగా పట్టుకోవడంతో, సర్పం ఆ పట్టు విదిలించుకుని బయట పడలేకపోయింది. కొంతసేపు పోరాడిన తరవాత పాషాంకర నోటినుంచి అగ్ని జ్వాలలను డేగమీదికి ఊదింది!



అయినా డేగ పట్టువదలకుండా ముక్కుతో పొడిచి పాషాంకరను గాయపరచింది. అలాగే ఆకాశంలో ఎగురుతూ వెళ్ళి సర్పాన్ని తాంత్రికుడి గుహముందు పడవేసింది.

ఏదో దభీమంటూ కిందపడిన శబ్దం విని గుహ వెలుపలికి వచ్చిన తాంత్రికుడు, నేలమీద సర్పం విలవిలలాడుతూండడం చూసి దిగ్భ్రాంతి చెందాడు. దూరంగా డేగ ఎగిరిపోతూన్నది.






ఆదిత్యుడు ధ్యానంలో ఉంటూనే జరుగుతూన్న ఈ వింత సంఘటనలను గ్రహించసాగాడు.

స్త్రీ తలా, అర్ధశరీరం గల సర్పం అగ్నిపర్వతం నుంచి వెలువడే లావాలా కరిగిపోయి మునుపటి పాషాంకర రూపం ఏర్పడింది.







పాషాంకర పొగలా మారి అదృశ్యమైపోయింది.

నాగబంధు తీవ్రమైన దిగ్భ్రాంతికి లోనయ్యాడు.






తాంత్రికుడి హెచ్చరిక ఆదిత్యుడి ధ్యానానికి భంగం కలిగించింది. ఏదో వింత వెలుగు అతన్ని సమీపించసాగింది.

మృదుమధుర కంఠస్వరం వినిపించింది.



ఆ వింత కంఠస్వరం, చెవిలో చెబుతూన్నట్టు మరీ మెల్లగా వినిపించింది.







గరుడుడు తనకు ఎన్నో శక్తులు ప్రసాదించినట్టు ఆదిత్యుడు విశ్వసించాడు.




ఆ మృదు కంఠస్వరం ఆగిపోగానే, ఆదిత్యుడు ఆసనంపై నుంచి లేచి నిలబడ్డాడు.

ఆదిత్యుడు ఈకను తన తలపాగాలో జాగ్రత్తగా దాచి, ముడి వేసుకున్నాడు.







ఇంకావుంది

## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 13

మన పురాణాలలోని కొన్ని యువపాత్ర(హీరో)ల గురించి ఇక్కడ ప్రస్తావించబడింది. వారిని గురించి మీకు తెలుసా?

**అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!***



1. సంగ్రామంలో పద్మవ్యూహం ఛేదించుకుని లోపలికి ప్రవేశించాను. వెలుపలికి వచ్చేదారి తెలియక వీరస్వర్గం అలంకరించాను. నేనెవరో తెలుసా?

-----------------------------------------------

2. మహావిష్ణువు ఇచ్చిన వరం నన్ను ఆకాశంలో నక్షత్రంగా చేసింది. నా పేరేమిటి?

-----------------------------------------------

3. నా తండ్రి చెప్పిన ఒకమాట కారణంగా సాక్షాత్తు యమధర్మరాజు నుంచే జనన మరణ రహస్యాలను తెలుసుకున్నాను. నేనెవరిని?

-----------------------------------------------

4. అంధులైన నా తల్లిదండ్రులను భుజాలపై మోస్తూ ఒక రాజు తెలియక బాణంతో కొట్టేంతవరకూ జాగ్రత్తగా కాపాడాను. మీరు నన్నెరుగుదురా?

-----------------------------------------------

5. నా తండ్రి నన్ను చంపడానికి చాలాసార్లు ప్రయత్నించాడు. అయితే, ప్రతిసారీ దేవుడు భక్తుడినైన నన్ను రక్షించాడు. నా పేరేమిటి?

-----------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన యువపాత్ర వీరుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పదిపదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన యువపాత్ర వీరుడు:**

.......................................................................

.......................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................

వయసు: .............. తరగతి: ...........................

చిరునామా: ..................................................

.......................................................................

పిన్: .......................... ఫోన్: ..........................

పాల్గొనేవారి సంతకం: ..........................

తల్లి/తండ్రి సంతకం: ..........................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 నవంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-13
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈక్కాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు డిసెంబర్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

ఆగస్టు 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

కె. జయశ్రీ
1-92 ఇ, నీలిమ థియేటర్ సమీపం
అనంతపురం - 515 004 (ఆం.ప్ర).




మొదటిఫోటో: మనిషి చేసిన తోలుబొమ్మ!
రెండవఫోటో: పాపను మురిపిస్తున్నాడమ్మా!!

వినోదసమయం సమాధానాలు (పేజీ 54)

## తేడాలు కనుగొనండి!

1. డైనోజార్ కనుబొమలు
2. డైనోజార్ మచ్చలు
3. డైనోజార్ పాదాలు
4. కుందేలు దంతాలు
5. రాళ్ళు
6. కోతి తోక
7. చెట్టుకొమ్మ
8. కొమ్మకు చుట్టిన కోతి తోక




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

